# పంచ సూక్తాలు

## టీకాతాత్పర్య సహితం



సూక్తమ్, నారాయణ సూక్తమ్, శ్రీ సూక్తమ్, భూ సూక్తమ్, నీళా సూక్తమ్

(అనుబంధం - మన్యు సూక్తమ్)

# ముందు మాట

భక్తులు ఇతోధికంగా కోరుకుంటున్న పంచసూక్తాలను మరియు మన్యుసూక్తాన్ని తాత్పర్యంతో సహా అందించాలన్న మా అభిలాష ఇప్పటికి నెరవేరుతున్నందుకు సంతోషిస్తున్నాం. ఐతే వీటిని కేవలం ప్రాపంచిక ప్రయోజనాల నిమిత్తం పఠించడం అవివేకం అవుతుంది. ఈ సూక్తాలు లౌకిక మరియు పారలౌకిక ప్రయోజనాలను నెరవేరుస్తాయనడం నిస్సందేహం. ఈ కారణాననే ఇవి ఇంత ప్రాచుర్యాన్ని పొందాయి.

ఈ సూక్తాలన్నింటిలో పురుషసూక్తమ్ మకుటాయమానమైన దనటం నిజం. సముత్కృష్ట వేదాంత భావాలతో నిండి ఉన్న ఋగ్వేద సూక్తమది. తరువాతిదైన నారాయణ సూక్తమ్ కూడా అంతే మహిమాన్వితం. ఇక మూడవదైన శ్రీ సూక్తమ్ గురించి కొంచెం అధికంగా వివరణ అవసర మౌతుంది. ఈ సూక్తం ప్రాపంచిక సంపదల కోసమన్న భావన అధిక సంఖ్యాకులలో ఉంది. కానీ అది నిజం కాదు.

శ్రీ సూక్తమ్‌లోని 'అలక్ష్మీం మే నశ్యతాం' అంటే భావదారిద్ర్యాన్ని తొలగించమని కోరుకోవడం. అంతేగానీ కేవలం ధనాన్ని ప్రసాదించమని కోరుకోవడం కాదు. ఈ రోజులలో ధనవంతులు కూడా దుఃఖాన్ని అనుభవిస్తు న్నారు. దారిద్ర్యం కన్నా సంపదే అధిక దుఃఖకరమైనదిగా పరిణమిస్తున్నది. కాబట్టి నిజమైన సిరి ఐన జ్ఞానాన్ని ప్రసాదించమని మనం ప్రార్థించాలి. తరువాత మంత్రంలో 'మాయంతరాయాశ్చ' అని అనడం ద్వారా జ్ఞానానికి ఆటంకాలైన అంతర అజ్ఞానాన్ని, బాహ్య ఆటంకాలని తొలగించమని కోరుకోవడం ద్వారా ఈ సూక్తమ్ కూడా పారమార్థిక ప్రయోజనమే మనం వాంఛించవలసినదని మనకు తెలియజేస్తున్నది. తరువాతి మంత్రంలో కుబేరుడిని (ధనాన్ని), కీర్తిని కోరుకోవడం ద్వారా మాయని దాటితే మనకు సర్వైశ్వర్యాలు సిద్ధించినట్లే అని తెలియజేస్తున్న దీసూక్తమ్. 'వాచః సత్యమశీమహి, భక్తానాం శ్రీ సూక్తం జపేత్సదా, న క్రోధో నచ మాత్సర్యం నలోభో నాశుభా మతిః' మొదలైన అనువాకాల ద్వారా ఈ సూక్తమ్ కూడా పారలౌకిక ప్రయోజనాన్ని గురించే మనకు అధికంగా తెలియజేస్తున్నదని

గ్రహించాలి. *ధనం ధాన్యం పశుం బహుపుత్ర లాభం....* మొదలైన ప్రార్థనల ద్వారా మనం గ్రహించదగ్గ ఒక ముఖ్య విషయమేమంటే కేవలం ప్రార్థన ద్వారా కలిగిన సంతానమే నిజమైన సంతానమని, ధర్మార్జితమైన సిరి సంపదలే అనుభవించదగ్గ సంపదలని మనం గ్రహించాలి. స్వామి వివేకానంద దైవ ప్రార్థన ద్వారా కలిగిన సంతానమే ఆర్య సంతానమంటారు. ప్రార్థన లేకుండా పుట్టినవారు అనార్యులు.

ఇక భూ సూక్తమ్; ... *బహుళా, విశ్వా* మొదలైన విశేషణాలతో వర్ణింపబడటం ద్వారా ఇక్కడ వారు ఉద్దేశించిన పృథ్వీదేవత కూడా సర్వాంతర్యామి ఐన జగన్మాతగా గ్రహించనగును. వశిష్ట మహర్షి చే *'సా సత్యేతమృతేతి'* (సత్యస్వరూపంగా, అమృతతత్త్వంగా) వర్ణింపబడటం ఈ భావనను సమర్థిస్తోంది. నీళాదేవిని కూడ విష్ణుదేవుని సఖిగా నీళా సూక్తమ్ అభివర్ణిస్తున్నది. ఇందులో కూడా వ్యక్తిగత ప్రయోజనాలకన్నా సమాజ ప్రయోజనాలకై, సమష్టి ప్రయోజనాలకై దేవిని ప్రార్థించటం మనం చూస్తాం. అందరికీ మంగళాన్ని కల్పించమని కోరటమే మనకు కన్పిస్తుంది.

మన్యుసూక్తంలో ముఖ్యంగా చెప్పబడినది శత్రుజయం గురించి. శత్రువులంటే బాహ్యశత్రువులు కాదు. నిజానికి బాహ్య శత్రువులు శత్రువులు కాదు. అంతః కరణాన్ని అంటిపెట్టుకుని ఉండే కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాలే నిజమైన శత్రువులు. వీటిని జయించడమే నిజమైన విజయం. మన్యుసూక్తమ్ ఈ శత్రువులను జయించే దిశగా మనకు ఉపయోగపడే ప్రార్థన.

కాబట్టి శ్రద్ధాళువులు ఈ సూక్తాలను పైన వివరించిన రీతిగా వాటి పారమార్థిక ప్రయోజనాన్ని లక్ష్యంగా చేగొని, పఠించి తత్ఫలాన్ని పొంద గలరని మా ఆకాంక్ష.

భూ సూక్తమ్, నీళా సూక్తమ్, మన్యూ సూక్తాలకు తెలుగు అనువాదం అందించిన ఆచార్య పెన్నా మధుసూధన శర్మ, సంస్కృత విశ్వవిద్యాలయం, రామ్‌టెక్ గారికి మా కృతజ్ఞతలు.

– ప్రకాశకులు



# పంచ సూక్తాలు

## (పారాయణం)

# పురుషసూక్తమ్

ఋగ్వేదం, 10.8.90

ఓం తచ్ఛం॒ యోరావృ॑ణీమహే । గా॒తుం య॒జ్ఞాయ॑ । గా॒తుం య॒జ్ఞప॑తయే । దైవీ᳚ స్వ॒స్తిర॑స్తు నః । స్వ॒స్తిర్మాను॑షేభ్యః । ఊ॒ర్ధ్వం జిగాతు భే॒షజమ్ । శం నో॑ అస్తు ద్వి॒పదే᳚ । శం చతు॑ష్పదే ॥

ఓం శాంతి॒ః శాంతిః శాంతి॑ః ॥

ఓం స॒హస్ర॑శీర్‌షా॒ పురు॑షః । స॒హ॒స్రా॒క్షః స॒హస్ర॑పాత్ । స భూమిం॑ వి॒శ్వతో॑ వృ॒త్వా । అత్య॑తిష్ఠద్దశాంగు॒లమ్ । పురు॑ష ఏ॒వేదగ్ం సర్వ᳚మ్ । యద్భూ॒తం యచ్చ॒ భవ్య᳚మ్ । ఉ॒తామృ॑త॒త్వస్యేశా॑నః । యదన్నే॑నాతి॒రోహ॑తి । ఏ॒తావా॑నస్య మహి॒మా । అతో॒ జ్యాయాగ్॑శ్చ॒ పూరు॑షః ॥ 1

పాదోఽ స్య విశ్వాభూతాని । త్రిపాదస్యామృతం దివి ।
త్రిపాదూర్ధ్వ ఉదైత్పురుషః । పాదోఽ స్యేహాఽ భవాత్పునః ।
తతో విష్వఙ్వ్యక్రామత్। సాశనానశనే అభి। తస్మాద్విరాడజాయత।
విరాజో అధి పూరుషః। స జాతో అత్యరిచ్యత । పశ్చాద్భూమిమథో
పురః ॥ 2

యత్పురుషేణ హవిషా । దేవా యజ్ఞమతన్వత । వసంతో
అస్యాసీదాజ్యమ్ । గ్రీష్మ ఇధ్మశ్శరద్ధవిః । సప్తాస్యాసన్పరిధయః ।
త్రిః సప్త సమిధః కృతాః । దేవా యద్యజ్ఞం తన్వానాః ।
అబధ్నన్పురుషం పశుమ్ । తం యజ్ఞం బర్హిషి ప్రౌక్షన్ ।
పురుషం జాతమగ్రతః ॥ 3

తేన దేవా అయజంత । సాధ్యా ఋషయశ్చ యే ।
తస్మాద్యజ్ఞాత్సర్వహుతః । సంభృతం పృషదాజ్యమ్ ।
పశూగ్‌స్తాగ్‌శ్చక్రే వాయవ్యాన్ । ఆరణ్యాన్గ్రామ్యాశ్చ యే ।
తస్మాద్యజ్ఞాత్సర్వహుతః । ఋచః సామాని జజ్ఞిరే । ఛందాగ్‌ంసి
జజ్ఞిరే తస్మాత్ । యజుస్తస్మాదజాయత ॥ 4

తస్మాదశ్వా అజాయంత । యే కే చోభయాదతః । గావో హ జజ్ఞిరే తస్మాత్ । తస్మాజ్జాతా అజావయః। యత్పురుషం వ్యదధుః। కతిధా వ్యకల్పయన్ । ముఖం కిమస్య కౌ బాహూ । కావూరూ పాదావుచ్యేతే । బ్రాహ్మణో ఽస్య ముఖమాసీత్ ।
బాహూ రాజన్యః కృతః ॥ 5

ఊరూ తదస్య యద్వైశ్యః । పద్భ్యాగ్ం శూద్రో అజాయత । చంద్రమా మనసో జాతః । చక్షోః సూర్యో అజాయత । ముఖాదింద్రశ్చాగ్నిశ్చ । ప్రాణాద్వాయురజాయత । నాభ్యా ఆసీదంతరిక్షమ్ । శీర్ష్ణో ద్యౌః సమవర్తత । పద్భ్యాం భూమిర్దిశః
శ్రోత్రాత్ । తథా లోకాగ్ం అకల్పయన్ ॥ 6

వేదాహమేతం పురుషం మహాంతమ్ । ఆదిత్యవర్ణం తమసస్తుపారే । సర్వాణి రూపాణి విచిత్య ధీరః । నామాని కృత్వా ఽభివదన్, యదాస్తే । ధాతా పురస్తాద్యముదాజహార । శక్రః ప్రవిద్వాన్ప్రదిశశ్చతస్రః । తమేవం విద్వానమృత ఇహ భవతి । నాన్యః పంథా అయనాయ విద్యతే । యజ్ఞేన

యజ్ఞమయజంత దేవాః । తాని ధర్మాణి ప్రథమాన్యాసన్ । తే
హ నాకం మహిమానః సచంతే । యత్ర పూర్వే సాధ్యాః సంతి
దేవాః ॥ 7

అద్భ్యః సంభూతః పృథివ్యై రసాచ్చ । విశ్వకర్మణః
సమవర్తతాధి। తస్య త్వష్టా విదధద్రూపమేతి । తత్పురుషస్య
విశ్వమాజానమగ్రే । వేదాహమేతం పురుషం మహాంతమ్ ।
ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్। తమేవం విద్వానమృత ఇహ
భవతి । నాన్యః పంథా విద్యతే ఽయనాయ । ప్రజాపతిశ్చరతి
గర్భే అంతః । అజాయమానో బహుధా విజాయతే ॥ 8

తస్య ధీరాః పరిజానంతి యోనిమ్ । మరీచీనాం
పదమిచ్ఛంతి వేధసః । యో దేవేభ్య ఆతపతి । యో దేవానాం
పురోహితః । పూర్వో యో దేవేభ్యో జాతః । నమో రుచాయ
బ్రాహ్మయే । రుచం బ్రాహ్మం జనయంతః । దేవా అగ్రే తదబ్రువన్
। యస్త్వైవం బ్రాహ్మణో విద్యాత్। తస్య దేవా అసన్ వశే ॥ 9

హ్రీశ్చ తే లక్ష్మీశ్చ పత్న్యౌ । అహోరాత్రే పార్శ్వే । నక్షత్రాణి రూపమ్ అశ్వినౌ । వ్యాత్తమ్ । ఇష్టం మనిషాణ । అముం మనిషాణ। సర్వం మనిషాణ ॥ 10

ఓం శాంతిః శాంతిః శాంతిః

ఓం తచ్ఛం యోరావృణీమహే । గాతుం యజ్ఞాయ । గాతుం యజ్ఞపతయే । దైవీ స్వస్తిరస్తు నః । స్వస్తిర్మానుషేభ్యః। ఊర్ధ్వం జిగాతు భేషజమ్ । శం నో అస్తు ద్విపదే । శం చతుష్పదే ॥

ఓం శాంతిః శాంతిః శాంతిః ॥



# నారాయణ సూక్తమ్

## తైత్తిరీయ ఆరణ్యకమ్ 4.10.13

ఓం సహ నావవతు । సహ నౌ భునక్తు । సహ వీర్యం కరవావహై । తేజస్వినావధీతమస్తు మా విద్విషావహై ॥

ఓం శాంతిః శాంతిః శాంతిః ॥

ఓం॥ సహస్రశీర్షం దేవం విశ్వాక్షం విశ్వశంభువమ్ । విశ్వం నారాయణం దేవమక్షరం పరమం పదమ్ । విశ్వతః పరమాన్నిత్యం విశ్వం నారాయణగ్ం హరిమ్ । విశ్వమేవేదం పురుషస్తద్విశ్వ-ముపజీవతి । పతిం విశ్వస్యాత్మేశ్వరగ్ం శాశ్వతగ్ం శివమచ్యుతమ్ । నారాయణం మహాజ్ఞేయం విశ్వాత్మానం పరాయణమ్। నారాయణపరో జ్యోతిరాత్మా నారాయణః పరః । నారాయణపరం బ్రహ్మ తత్త్వం నారాయణః పరః ।

నారాయణపరో ధ్యాతా ధ్యానం నారాయణః పరః యచ్చ కించిజ్జగత్సర్వం దృశ్యతే శ్రూయతేఽపి వా॥

అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః । అనంతమవ్యయం కవిగ్ం సముద్రేఽంతం విశ్వశంభువమ్ । పద్మకోశప్రతీకాశగ్ం హృదయం చాప్యధోముఖమ్ । అధో నిష్ట్యా వితస్త్యాంతే నాభ్యాముపరి తిష్ఠతి । జ్వాలమాలాకులం భాతీ విశ్వస్యాయ-తనం మహత్ । సంతతగ్ం శిలాభిస్తు లంబత్యాకోశసన్నిభమ్ । తస్యాంతే సుషిరగ్ం సూక్ష్మం తస్మిన్ సర్వం ప్రతిష్ఠితమ్ । తస్య మధ్యే మహానగ్నిర్విశ్వార్చిర్విశ్వతోముఖః । సోఽగ్రభుగ్విభజంతిష్ఠన్నాహార మజరః కవిః । తిర్యగూర్ధ్వమధశ్శాయీ రశ్మయస్తస్య సంతతా। సంతాపయతి స్వం దేహమాపాదతలమస్తకః । తస్య మధ్యే వహ్నిశిఖా అణీయోర్ధ్వా వ్యవస్థితః । నీలతోయదమధ్యస్థాద్విద్యుల్లేఖేవ భాస్వరా । నీవార శూకవత్తన్వీ పీతా భాస్వత్యణూపమా । తస్యాః శిఖాయా

మధ్యే పరమాత్మా వ్యవస్థితః । స బ్రహ్మ స శివః స హరిః సేంద్రః సోఽక్షరః పరమః స్వరాట్ ॥

ఋతగ్ం సత్యం పరం బ్రహ్మ పురుషం కృష్ణపింగలమ్ । ఊర్ధ్వరేతం విరూపాక్షం విశ్వరూపాయ వై నమో నమః ॥

ఓం నారాయణాయ విద్మహే వాసుదేవాయ ధీమహి । తన్నో విష్ణుః ప్రచోదయాత్ ॥

ఓం సహ నావవతు । సహ నౌ భునక్తు । సహ వీర్యం కరవావహై । తేజస్వినావధీతమస్తు మా విద్విషావహై ॥

ఓం శాంతిః శాంతిః శాంతిః ॥



# శ్రీ సూక్తమ్

## ఋగ్వేదం

ఓం హిరణ్యవర్ణాం హరిణీం సువర్ణరజతస్రజామ్। చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మ ఆవహ ॥ తాం మ ఆవహ జాతవేదో లక్ష్మీమనపగామినీమ్। యస్యాం హిరణ్యం విందేయం గామశ్వం పురుషానహమ్ । అశ్వపూర్వాం రథమధ్యాం హస్తినాద-ప్రబోధినీమ్। శ్రియం దేవీముపహ్వయే శ్రీర్మా దేవీర్జుషతామ్ ॥ కాం సోస్మితాం హిరణ్యప్రాకారామార్ద్రాం జ్వలంతీం తృప్తాం తర్పయంతీమ్ । పద్మే స్థితాం పద్మవర్ణాం తామిహోపహ్వయే శ్రియమ్ ॥ చంద్రాం ప్రభాసాం యశసా జ్వలంతీం శ్రియం లోకే దేవజుష్టాముదారామ్। తాం పద్మినీమీం శరణమహం ప్రపద్యేఽ లక్ష్మీర్మే నశ్యతాం త్వాం వృణే ॥ ఆదిత్యవర్ణే తపసోఽధిజాతో వనస్పతిస్తవ వృక్షోఽథబిల్వః। తస్య

ఫలాని తపసా నుదన్తు మాయాంతరాయాశ్చ బాహ్యా అలక్ష్మీః॥ ఉపైతు మాం దేవసఖః కీర్తిశ్చ మణినా సహ। ప్రాదుర్భూతోఽస్మి రాష్ట్రేఽస్మిన్ కీర్తిమృద్ధిం దదాతు మే ॥ క్షుత్పిపాసామలాం జ్యేష్ఠామలక్ష్మీం నాశయామ్యహమ్। అభూతిమసమృద్ధిం చ సర్వాం నిర్ణుద మే గృహాత్ ॥ గంధద్వారాం దురాధర్షాం నిత్యపుష్టాం కరీషిణీమ్ ॥ ఈశ్వరీగ్ం సర్వభూతానాం తామిహోపహ్వయే శ్రియమ్ ॥ మనసః కామమాకూతిం వాచః సత్యమశీమహి। పశూనాం రూపమన్నస్య మయి శ్రీః శ్రయతాం యశః ॥ కర్దమేన ప్రజాభూతా మయి సంభవ కర్దమ। శ్రియం వాసయ మే కులే మాతరం పద్మమాలినీమ్ ॥ ఆపః స్రుజంతు స్నిగ్ధాని చిక్లీత వస మే గృహే। నిచ దేవీం మాతరం శ్రియం వాసయ మే కులే। ఆర్ద్రాం పుష్కరిణీం పుష్టిం పింగలాం పద్మమాలినీమ్। చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మ ఆవహ ॥ ఆర్ద్రాం యః కరిణీం యష్టిం సువర్ణాం హేమమాలినీమ్। సూర్యాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మ ఆవహ। తాం

మ ఆవహ జాతవేదో లక్ష్మీమనపగామినీమ్। యస్యాం హిరణ్యం ప్రభూతం గావో దాస్యోఽశ్వాన్, విందేయం పురుషానహమ్ ॥

యః శుచిః ప్రయతో భూత్వా జుహుయాదాజ్యమన్వహమ్। శ్రియః పంచదశర్చం చ శ్రీకామః సతతం జపేత్ ॥ ఆనన్దః కర్దమశ్చైవ చిక్లీత ఇతి విశ్రుతాః । ఋషయస్తే త్రయః ప్రోక్తాస్స్వయం శ్రీరేవ దేవతా ॥ పద్మాననే పద్మ ఊరూ పద్మాక్షీ పద్మసంభవే । త్వం మాం భజస్వ పద్మాక్షీ యేన సౌఖ్యం లభామ్యహమ్ ॥ అశ్వదాయీ గోదాయీ ధనదాయీ మహాధనే । ధనం మే జుషతాం దేవిసర్వకామాంశ్చ దేహి మే ॥ పుత్రపౌత్ర ధనం ధాన్యం హస్త్యశ్వాదిగవే రథమ్ । ప్రజానాం భవసి మాతా ఆయుష్మంతం కరోతు మామ్ ॥ ధనమగ్నిర్ధనం వాయుర్ధనం సూర్యో ధనం వసుః । ధనమింద్రో బృహస్పతిర్వరుణం ధనమశ్నుతే ॥ చంద్రాభాం లక్ష్మీ మీశానాం సూర్యాభాం శ్రియమీశ్వరీమ్ । చంద్రసూర్యాగ్ని వర్ణాభాం శ్రీమహాలక్ష్మీముపాస్మహే ॥ వైనతేయ సోమం పిబ సోమం పిబతు వృత్రహా । సోమం ధనస్య సోమినో

మహ్యం దదాతు స్వోమినః ॥ న క్రోధో న చ మాత్సర్యం న లోభో నాశుభా మతిః । భవంతి కృతపుణ్యానాం భక్తానాం శ్రీసూక్తం జపేత్సదా ॥ వర్షంతు తే విభావరి దివో అభ్రస్య విద్యుతః । రోహంతు సర్వబీజాన్యవ బ్రహ్మ ద్విషో జహి ॥ పద్మప్రియే పద్మిని పద్మహస్తే పద్మాలయే పద్మదలాయతాక్షి । విశ్వప్రియే విష్ణు మనోఽనుకూలే త్వత్పాదపద్మం మయి సన్నిధత్స్వ ॥ యా సా పద్మాసనస్థా విపులకటితటీ పద్మపత్రాయతాక్షీ । గంభీరా వర్తనాభిః స్తనభర నమితా శుభ్ర వస్త్రోత్తరీయా ॥ లక్ష్మీర్దివ్యైర్గజేంద్రైమణిగణ ఖచితైస్స్నాపితా హేమకుంభైః।

నిత్యం సా పద్మహస్తా మమ వసతు గృహేసర్వమాంగల్య యుక్తా॥ లక్ష్మీం క్షీరసముద్ర రాజతనయాం శ్రీరంగధామేశ్వరీమ్। దాసీభూతసమస్త దేవ వనితాం లోకైక దీపాంకురామ్ । శ్రీమన్మందకటాక్షలబ్ధ విభవ బ్రహ్మేంద్రగంగాధరాం । త్వాం త్రైలోక్యకుటుంబినీం సరసిజాం వందే ముకుందప్రియామ్ ॥

సిద్ధలక్ష్మీర్మోక్షలక్ష్మీర్జయలక్ష్మీస్సరస్వతీ । శ్రీలక్ష్మీర్వర లక్ష్మీశ్చ ప్రసన్నా మమ సర్వదా । వరాంకుశౌ పాశమభీతిముద్రాం కరైర్వహంతీం కమలాసనస్థామ్ । బాలార్క కోటి ప్రతిభాం త్రిణేత్రాం భజేహమాద్యాం జగదీశ్వరీం త్వామ్ ॥

సర్వమంగలమాంగల్యే శివే సర్వార్థ సాధికే । శరణ్యే త్ర్యంబకే దేవి నారాయణి నమోஉస్తు తే ॥ నారాయణి నమోஉస్తు తే । నారాయణి నమోஉస్తు తే ॥

సరసిజ - నిలయే సరోజహస్తే ధవలతరాంశుక గంధమాల్యశోభే । భగవతి హరివల్లభే మనోజ్ఞే త్రిభువనభూతికరి ప్రసీద మహ్యమ్ ॥

ఓం విష్ణుపత్నీం క్షమాం దేవీం మాధవీం మాధవప్రియామ్। విష్ణోః ప్రియసఖీం దేవీం నమామ్యచ్యుతవల్లభామ్ ॥

ఓం మహాలక్ష్మీ చ విద్మహే విష్ణుపత్నీ చ ధీమహి । తన్నో లక్ష్మీః ప్రచోదయాత్ ॥ శ్రీవర్చస్యమాయుష్యమారోగ్య మావిధాత్ పవమానం మహీయతే । ధనం ధాన్యం పశుం బహుపుత్రలాభం

శతసంవత్సరం దీర్ఘమాయుః । ఋణ రోగాదిదారిద్ర్యపాప క్షుదపమృత్యవః । భయశోకమనస్తాపా నశ్యంతు మమ సర్వదా ॥

శ్రియే జాత శ్రియ ఆనిర్యాయ శ్రియం వయో జరితృభ్యో దధాతు । శ్రియం వసానా అమృతత్వమాయన్ భజంతి సద్యః సవితా విదధ్యాన్ ॥ శ్రియ ఏవైనం తచ్ఛ్రియామాదధాతి । సంతతమృచా వషట్కృత్యం సంధత్తం సంధీయతే ప్రజయా పశుభిః । య ఏవం వేద । ఓం మహాదేవ్యై చ విద్మహే విష్ణుపత్నీ చ ధీమహి । తన్నో లక్ష్మీః ప్రచోదయాత్ ॥

ఓం శాంతిః శాంతిః శాంతిః ॥



# శ్రీ భూసూక్తమ్

(కృష్ణయజుర్వేదం - తైత్తిరీయసంహితా)

ఓమ్ భూమిర్భూమ్నా ద్యౌ ర్వరిణాఽ న్తరిక్షం మహిత్వా
ఉపస్థే తే దేవ్యదితేఽగ్నిమన్నాద మన్నాద్యాయాఽదధే 1
ఆయం గౌః ప్రశ్నిరక్రమీదసన్మాతరం పునః
పితరఞ్చ ప్రయన్సువః 2
త్రిగ్ం శద్ధామవి రాజతి వాక్పతఙ్గాయ శిశ్రియే,
ప్రత్యస్య వహద్యుభిః. 3
అస్య ప్రాణాదపానత్యన్తశ్చరతి రోచనా,
వ్యఖ్యన్మహిషస్సువః. 4
యత్వా క్రుద్ధః పరోవప మన్యునా యదవర్త్యా
సుకల్పమగ్నే తత్తవ పునస్త్వోద్దీపయామసి
యత్తే మన్యుపరోప్తస్య పృథివీ మనుదధ్వసే,

ఆదిత్యా విశ్వే తద్దేవా వసవశ్చ సమాభరన్ 5

మేదినీ దేవీ వసుంధరా స్యాద్వసుధా దేవీ వాసవీ (వాసుకీ)

బ్రహ్మవర్చసః పితౄణామ్ శ్రోత్రం చక్షుర్మనః 6

దేవీ హిరణ్యగర్భిణీ దేవీ ప్రసోదరీ

సదనే సత్యాయనే సీద. 7

సముద్రవతీ సావిత్రీ అ(హ) నో దేవీ మహ్యంగీ(కీ)

మహో ధరణీ మహోఽ త్యతిష్ఠత్ 8

శృఙ్గే శృఙ్గే యజ్ఞే యజ్ఞే విభీషణీ,

ఇన్ద్రపత్నీ వ్యాపినీ సరసిజ ఇహ 9

వాయుమతీ జలశయనీ స్వయం ధా రాజా సత్యం తో పరి

మేదినీ సోపరిధత్తంగాయ 10

విష్ణుపత్నీం మహీం దేవీం మాధవీం మాధవప్రియామ్

లక్ష్మీం ప్రియసఖీం దేవీం నమామ్యచ్యుత వల్లభామ్ 11

ధనుర్ధరాయై విద్మహే సర్వ సిద్ధ్యై చ ధీమహి

తన్నో ధరా ప్రచోదయాత్. 12

శృణ్వన్తి శ్రోణామమృతస్య గోపాం,
పుణ్యామస్యా ఉపశృణోమి వాచమ్,
మహీం దేవీం విష్ణుపత్నీమజూర్యాం
ప్రతీచీమేనాగ్ం హవిషా యజామః. 13
త్రేధా విష్ణు రురుగాయో విచక్రమే
మహీన్దివం పృథివీ మన్తరిక్షమ్
తచ్ఛ్రోణైతి శ్రవ ఇచ్ఛమానా
పుణ్యం శ్లోకం యజమానాయ కృణ్వతీ. 14
స్యోనా పృథివి భవానృక్షరా నివేశనీ
యచ్ఛానః శర్మ సప్రథః 15
అదితిర్దేవా గంధర్వా మనుష్యాః పితరో సురాస్తేషాగ్ం
సర్వ భూతానాం మాతా మేదినీ మహతీ మహీ,
సావిత్రీ గాయత్రీ జగత్యుర్వీ పృధ్వీ బహుళా విశ్వా
భూతా కతమా కాయా సా సత్యేత్యమృతేతి వశిష్ఠః 16
ఇక్షుశాలియవసస్యఫలాఢ్యే పారిజాత తరుశోభితమూలే,

స్వర్ణ రత్న మణి మంటప మధ్యే చిన్తయేత్ సకలలోకధరిత్రీమ్. 17

శ్యామాం విచిత్రాం నవరత్న భూషితాం,

చతుర్భుజాం తుంగపయోధరాన్వితామ్,

ఇన్దీవరాక్షీం నవశాలి మఞ్జరీం,

శుకం దధానాం శరణం భజామహే. 18

సక్తుమివ తితఉనా పునన్తో యత్ర ధీరా మనసా వాచ మక్రత

అత్రా సఖాయఃసఖ్యాని జానతే భద్రైషాం లక్ష్మీర్నిహితాధివాచి.

19

ఓం శాన్తిః శాన్తిః శాన్తిః



# శ్రీనీళాసూక్తమ్

నీళాం దేవీగ్ం శరణమహం ప్రపద్యే॥ 1

స్తోమ త్రయస్త్రింశే భువనస్య పత్ని వివస్వద్వాతే అభి నో గృణాహి॥

2

ఘృతవతీ సవితరాధిపత్యైః॥ పయస్వతీరన్తిరాశానో అస్తు।

ధ్రువా దిశాం విష్ణు పత్న్యఘోరాఽ స్యేశానా సహసో యామనోతా।

బృహస్పతి ర్మాతరిశ్వోత వాయుః సన్ధువానా వాతా అభి నో

గృణన్తు॥ 3

విష్టమ్భో దివోధరుణః పృథివ్యా అస్యేశానా జగతో విష్ణుపత్నీ।

విశ్వవ్యచా ఇషయన్తీ సుభూతిఃశివా నో అస్త్వదితిరుపస్థే॥ 4

విష్ణుపత్న్యై చ విద్మహే శ్రీభూసఖ్యైచ ధీమహి। తన్నో నీళా

ప్రచోదయాత్॥ 5

అర్యమణం బృహస్పతి మిన్ద్రం దానాయ చోదయ। వాచం విష్ణుం

సరస్వతీం సవితారఞ్చ వాజినమ్। 6

సోమం రాజానం వరుణ మగ్నిమన్వారభామహే। ఆదిత్యాన్
విష్ణుం సూర్యం బ్రహ్మాణఞ్చ బృహస్పతిమ్॥ 7

దేవస్య త్వా సవితుః ప్రసవేఽశ్వినోర్బాహుభ్యాం పూష్ణో
హస్తాభ్యాగ్ం సరస్వత్యై వాచో యన్తుర్యన్త్రేణాగ్నేస్త్వా
సామ్రాజ్యేనాభిషిఞ్చామి॥ ఇన్ద్రస్య బృహస్పతే స్త్వా సామ్రాజ్యే-
నాభిషిఞ్చామి॥ 8

నిషసాద ధృతవ్రతో వరుణః పస్త్యాస్వా సామ్రాజ్యాయ సుక్రతుః॥
దేవస్య త్వా సవితుః ప్రసవే। అశ్వినోర్బాహుభ్యాం పూష్ణో
హస్తాభ్యామ్। అశ్వినోః భైషజ్యేన తేజసే బ్రహ్మవర్చ
సాయాభిషిఞ్చామి॥ 9

దేవస్య త్వా సవితుః ప్రసవే। అశ్వినోర్బాహుభ్యాం పూష్ణో
హస్తాభ్యాం। సరస్వత్యై భైషజ్యేన। వీర్యాయాన్నాద్యా
యాభిషిఞ్చామి॥ 10

దేవస్య త్వా సవితుః ప్రసవే। అశ్వినోర్బాహుభ్యాం
పూష్ణోహస్తాభ్యాం। ఇంద్రస్యేంద్రియేణ శ్రియై యశసే
బలాయాభిషిఞ్చామి॥ అమృతాభిషేకోఽస్తు ॥ 11

ఓం శాన్తిః శాన్తిః శాన్తిః



# శ్రీ మన్యుసూక్తమ్

(ఋగ్వేద సూక్తమ్)

హరిః ఓమ్

యస్తే మన్యో ఇతి సప్తర్చస్య సూక్తస్య తాపసో మన్యు ఋషిః మన్యుర్దేవతా జగతీఛందః ద్వితీయే సప్తమే చ త్రిష్టుప్ త్వయా మన్యో ఇతి సప్తర్చస్య సూక్తస్య తాపసో మన్యుఋషిః మన్యుర్దేవతా ఆద్యాస్తిస్రస్త్రిష్టుభః తతశ్చతస్రో జగత్యః మన్యుదేవతా ప్రసాద సిద్ధ్యర్థే జపే వినియోగః

| | |
|---|---|
| సంసృష్టం ధన ముభయం | అంగుష్ఠాభ్యాం నమః |
| సమాకృతమస్మభ్యం ధత్తాం | తర్జనీభ్యాం నమః |
| వరుణశ్చ మన్యుః | మధ్యమాభ్యాం నమః |
| భియం దధానా | అనామికాభ్యాం నమః |
| హృదయేషు శత్రవః | కనిష్ఠికాభ్యాం నమః |
| పరాజితాసో అపనిలయన్తాం | కరతలకరపృష్ఠాభ్యాం నమః |

సంస్పృష్టం ధన ముభయం — హృదయాయ నమః
సమాకృతమస్మభ్యం — ధత్తాం శిరసే స్వాహా
వరుణశ్చ మన్యుః — శిఖాయై వషట్
భియం దధానా — కవచాయ హుమ్
హృదయేషు శత్రవః — నేత్రత్రయాయ వౌషట్
పరాజితాసో అపనిలయన్తాం — అస్త్రాయ ఫట్

భూర్భువస్సువరోమితి దిగ్బంధః॥

యస్తే మన్యో విధద్వజ్రసాయకసహఓజః పుష్యతి విశ్వమా
నుషక్ సాహ్యామదాస మార్యం త్వయా యుజా సహస్కృతేన
సహసా సహస్వతా ॥1॥

మన్యురింద్రో మన్యురేవాస దేవో మన్యుర్హోతా వరుణో
జాతవేదాః మన్యుం విశ ఈళతే మానుషీర్యాః పాహి నో మన్యో
తపసా సజోషాః ॥2॥

అభీహి మన్యో తవసస్త వీయాన్ తపసాయుజా విజహి
శత్రూన్ అమిత్రహా వృత్రహా దస్యుహా చ విశ్వావసూ న్యాభరా
త్వన్నః ॥3॥

త్వం హి మన్యో అభిభూత్యోజా స్స్వయం భూర్భామో అభిమాతిషాహః విశ్వచర్షణి స్సహురిస్సహావా నస్మా స్వోజః పృతనాసుధేహి ॥4॥

అభాగ స్సన్న ప్రపరేతో అస్మి తవ క్రత్వా తవిషస్య ప్రచేతః తంత్వామన్యో అక్రతుర్జిహీళాహం స్వాతనూర్బలదేయా యమేహి ॥5॥

అయం తే అస్మ్యుపమే హ్యర్వాఙ్ప్రతీ చీనస్సహురే విశ్వధాయః మన్యో వజ్రి న్నభి మామావవృత్స్వహనా వదస్యూన్ బుతబో ధ్యాపేః ॥6॥

అభిప్రేహి దక్షిణతో భవామేధా వృత్రాణి జంఘనావభూరి జుహోమి తే ధరుణ మ్మధ్వో అగ్రముభా ఉపాంశు ప్రథమా పిబావ ॥7॥

త్వయా మన్యో సరథమారుజంతో హర్ష మాణాసో ధృషితా మరుత్వః తిగ్మేషవ ఆయుధాః సంశిశానా అభిప్రయంతు నరో అగ్నిరూపాః ॥8॥

అగ్నిరివ మన్యో త్విషిత స్సహస్వ సేనానీర్నస్సహురే హూతఏధి హత్వాయ శత్రూన్విభజస్వ వేద ఓజో మిమానో విమృధోనుదస్వ ॥9॥

సహస్వ మన్యో అభిమాతి మస్మే రుజన్ మృణన్ ప్రమృణన్ ప్రేహి శత్రూన్ ఉగ్రంతే పాజోనన్వారు రుధ్రే వశన్నయసఏక జత్వమ్ ॥10॥

ఏకో బహూనా మసిమన్యవీళితో విశం విశం యుూధయే సంశిశాధి అకృత్త రుక్త్వయా యుజా వయం ద్యుమంతం ఘోషం విజయాయ కృణ్మహే ॥11॥

విజేషకృదింద్ర ఇవానవబ్రవో..3..స్మాకం మన్యో అధిపా భవేహ ప్రియంతే నామ సహురే గృణీమసి విద్మాతముత్సం యత ఆ బభూథ ॥12॥

ఆ భూత్యా సహజా వజ్రసాయకసహో బిభర్ష్యబిభూత ఉత్తరమ్ క్రత్వానో మన్యో సహమేద్యేధి మహాధనస్య పురుహూత సంసృజి ॥13॥

సంస్సృష్టం ధన ముభయం సమాకృత మస్మభ్యంధత్తాం వరుణశ్చమన్యుః భియం దధానా హృదయేషు శత్రవః పరాజితాసో అపనిలయంతాం ॥14॥

ధన్వనాగా ధన్వనా జిం జయేమ ధన్వనా తీవ్రా స్సమదో జయేమ ధనుశ్శత్రో రపకామం కృణోతు ధన్వనా స్సర్వాః ప్రదిశో జయేమ ॥15॥

ఓం శాంతిః శాంతిః శాంతిః



# పంచ సూక్తాలు

## (తాత్పర్యం)

# పురుష సూక్తమ్

**ఓం తచ్ఛం యోరావృణీమహే । గాతుం యజ్ఞాయ । గాతుం యజ్ఞపతయే । దైవీ స్వస్తిరస్తు నః । స్వస్తిర్మానుషేభ్యః। ఊర్ధ్వం జిగాతు భేషజమ్ । శం నో అస్తు ద్విపదే । శం చతుష్పదే ॥**

**ఓం శాంతిః శాంతిః శాంతిః ॥**

యః = ఎవరు; శం = మంగళం ప్రసాదిస్తారో; తత్ = ఆ భగవంతుని; ఆవృణీమహే = ప్రార్థిస్తాము; యజ్ఞాయ = యజ్ఞం చక్కగా నెరవేర; గాతుం = అర్థిస్తున్నాము; యజ్ఞపతయే = యజ్ఞం నిర్వర్తించే వారికై; గాతుం = అర్థిస్తున్నాము; నః = మనకు; దైవీః = దేవతల; స్వస్తిః అస్తు = మేలు చేయుగాక; మానుషేభ్యః = మానవులందరికీ; స్వస్తి = మేలు ఒనగూరుగాక; భేషజమ్ = చెట్టుచేమలు; ఊర్ధ్వం జిగాతు = ఊర్ధ్వముఖంగా (పైకి) పెరుగుగాక; నః = మనవద్ద ఉన్న; ద్విపదే = రెండు పాదాల జీవులకు; శం అస్తు = మంగళకరం అగుగాక; చతుష్పదే = నాలుగు పాదాల జీవులకు; శం = మేలు జరుగుగాక.

**తా॥** *ఎవరు మంగళకరాన్ని అనుగ్రహిస్తారో ఆ భగవంతుని ప్రార్థిస్తాం, యజ్ఞం సవ్యంగా పరిసమాప్తమవ ప్రార్థిస్తాం. యజ్ఞం నిర్వర్తించేవారికై ప్రార్థిస్తాం. మనకు దేవతలు శుభం చేయుగాక, మానవులందరికీ మేలు జరుగుగాక. చెట్టుచేమలు ఊర్ధ్వముఖంగా పెరుగుగాక. మన వద్ద వసిస్తున్న ద్విపద జీవులకు మంగళకర మవుగాక, చతుష్పాద జీవులకు మేలు జరుగుగాక!*

*ఓం శాంతిః శాంతిః శాంతిః ॥*

జీవితాన్ని ఒక మహాయజ్ఞంగా, యాగంగా వేదకాల ఋషులు పరిగణించారు. ఆ యజ్ఞం సదా చక్కగా జరగడానికై చేసే ప్రార్థనామంత్రం ఇది. సృజింపబడిన సమస్తమూ యజ్ఞ వస్తువే. వాటి ప్రతిదాని మంగళంకోసం ఈ మంత్రం ప్రార్థిస్తుంది.

వేదమంత్రాలలో భావగర్భితమైనది, మంత్రశక్తిలో అతి ప్రధానమైనది ఈ పురుషసూక్తం. పురుషుడంటే భగవంతుడు. ఆ భగవంతుని మహత్యాన్ని కీర్తించే సూక్తం ఇది. దేవాలయంలో, గృహంలో, భగవదారాధనలో, నిత్య పారాయణలో, వైదిక క్రియలలో, నిత్యకృత్యాలలో పురుషసూక్తం పఠించడం కద్దు. పురుషసూక్తం వైదిక హైందవుని జీవితంలో ఒక అంగమై ఒప్పారుతున్నదని చెప్పవచ్చు. దీన్ని పఠించడం జీవితంలో శుభాన్ని చేకూరుస్తుందని గట్టిగా విశ్వసిస్తారు.

వేదాలను ప్రధానంగా మూడు భాగాలుగా విభజిస్తారు.

1. సంహిత – అనేక దేవతల ప్రార్థనలు
2. బ్రాహ్మణం – యాగ వివరాలు
3. ఆరణ్యకం (ఉపనిషత్తులు) – సనాతన సత్యాన్ని గురించిన విచారణ

పురుషసూక్తంలో పై మూడు అంశాలు గర్భితమై ఉన్నాయి. ఇది భగవంతుని మహత్యాన్ని కీర్తించడంతో ప్రారంభమౌతుంది. పిదప భగవంతుని త్యాగఫలంగా ఈ ప్రపంచమూ, జీవులూ ఆవిర్భవించాయని చెబుతుంది. తరువాత జీవుడు భగవంతుని పొంద అజ్ఞానాంధకారాన్ని అతిక్రమింప మార్గం చెబుతూ, అందుకైన హేతువునూ, దానికైన దారినీ వివరిస్తుంది. ఈ విధంగా పురుషసూక్తం ఒక పరిపూర్ణ శాస్త్రంగా ఒప్పారుతున్నది.

ముందుగా భగవంతుని మహిమ కీర్తింపబడుతున్నది.

**ఓం సహస్రశీర్షా పురుషః । సహస్రాక్షః । సహస్రపాత్ ।**

**స భూమిం విశ్వతో వృత్వా । అత్యతిష్ఠద్దశాంగులమ్ ॥ 1**

పురుషః = భగవంతుడు; సహస్రశీర్షాః= వేలాది శిరస్సులు గలవాడు; సహస్ర అక్షః= వేలాది కన్నులు గలవాడు; సహస్రపాత్ = వేలాది పాదాలు గలవాడు; సః = ఆయన; భూమిం = భూమిని; విశ్వతః = సర్వత్రా; వృత్వా = వ్యాపించి; దశ అంగులమ్ = పది అంగుళాలు వ్యాపించి; అత్యతిష్ఠత్ = నిలబడ్డాడు.

**తా॥** *భగవంతుడు వేలాది తలలు గలవాడు, వేలాది కన్నులు గలవాడు, వేలాది పాదాలు గలవాడు; భూమండలం సర్వత్రా వ్యాపించి పది అంగుళాలు అధిగమించి నిలిచాడు.*

భగవంతుడు సర్వత్రా నెలకొని ఉన్నాడన్న విషయాన్నే ఇలా వేలాది శిరస్సులు గలవాడు ఇత్యాదిగా వర్ణింపబడింది. సర్వవ్యాపియైన భగవంతుడు మనలోనూ వెలసి ఉన్నాడు. కొండ, చెట్టు వంటివాటి ఛాయాచిత్రం తీస్తున్నప్పుడు, అవి రూపంలో ఎంత పెద్దవైనా కెమేరాలోని ఫిల్మ్(film) పరిమాణానికే కుదింపబడి ముద్రింపబడతాయి. అట్లే పరిమితిలేని భగవంతుడు ధ్యానసమయంలో హృదయాకాశాన పది అంగుళాల పరిమాణం గలవాడుగా కానవస్తాడు.

**పురుష ఏవేదగ్ం సర్వమ్ । యద్భూతం యచ్చ భవ్యమ్ ।**

**ఉతామృతత్వస్యేశానః । యదన్నేనాతిరోహతి ॥ 2**

యత్ భూతం = మునుపు ఏది ఉన్నదో; యత్ భవ్యం చ = ఇక ఏది రాబోతున్నదో; ఇదం = ఇప్పుడు కానవస్తున్నదో; సర్వం =

సమస్తం; పురుషః ఏవ = భగవంతుడే; ఉత = మరియు; అమృతత్వస్య = మరణంలేని ఉన్నత స్థితికి; ఈశానః = అధిపతి యైనవాడూ; యత్ = ఆయన; అన్నేన = జడ ప్రపంచాన్ని; అతిరోహతి = అతి క్రమించినవాడు.

**తా॥** మునుపు ఏది ఉన్నదో, ఇక ఏదిరాబోతున్నదో సమస్తం *భగవంతుడే. మరణం లేని ఉన్నత స్థితికి అధిపతియైనవాడూ ఆయనే ఎందుకంటే ఆయన ఈ జడప్రపంచాన్ని అతిక్రమించినవాడు కనుక.*

**ఏతావానస్య మహిమా । అతో జ్యాయాగ్ శ్చ పూరుషః।**
**పాదోఽ స్య విశ్వా భూతాని । త్రిపాదస్యామృతం దివి ॥ 3**

ఏతావాన్ = ఇక్కడ కానవస్తున్నదంతా; అస్య = భగవంతుని; మహిమా = మహిమే; అతః = కాని; పురుషః చ = భగవంతుడు; జ్యాయాన్ = శ్రేష్ఠుడు; భూతాని విశ్వా = ఉద్భవమైనవన్నీ; అస్య = ఆయన యొక్క; త్రిపాద్ = ముప్పాతిక భాగం; అమృతం = మరణంలేని; దివి = గగనంలో ఉంది.

**తా॥** *ఇక్కడ కానవస్తున్నదంతా భగవంతుని మహిమే. కాని ఆ భగవంతుడు, వీటికంటే శ్రేష్ఠుడు. ఉద్భవమైనవన్నీ ఆయన పావుభాగం మాత్రమే. ఆయన ముప్పాతిక భాగం వినాశంలేని గగనంలో ఉంది.*

పరిమితిలేని భగవంతుని మహిమ ఇక్కడ ప్రస్తావించబడింది. కనిపించే ప్రపంచంలో ఒక్క అంశాన్ని సైతం మనం తెలుసుకోలేదు. ఇది భగవంతుని పావుభాగం మాత్రమే అంటూ పరిమాణానికి అందని ఆయన మహిమను ఈ మంత్రం తెలుపుతున్నది.

ఇక రాబోయేది వేదాలు సూచించే మహోన్నత అభిప్రాయాలలో ఒకటైన యజ్ఞం లేక యాగం.

వేదకాల ఋషులు ఈ ప్రపంచాన్నే ఒక మహాయజ్ఞంగా గాంచారు. ఒకింత ప్రశాంతతతో ఈ ప్రపంచాన్ని పరికిస్తే ఈ ప్రపంచం పోకడ ఒక మహాయజ్ఞంగా జరుతూండడం తెలియవస్తుంది.

పుట్టినవన్నీ గిడుతున్నాయి; పుష్పించినవన్నీ వాడిపోతున్నాయి, లేస్తూన్నవన్నీ పడిపోతున్నాయి, కానవచ్చేవన్నీ కనుమరుగైపోతున్నాయి. మరణించేవి నూతనంగా పుట్టేవాటికి కారణమౌతున్నాయి. వాడిపోతున్నవి కొత్తవి పుష్పింప కారణం అవుతున్నాయి. కనుమరుగవుతూన్నవి కొత్తవి కానరావడానికి కారణం అవుతున్నాయి. ఈ చక్రభ్రమణం దేనిని సూచిస్తున్నది? ఇక్కడ ఒక మహాయజ్ఞం జరుగుతున్నదనే కదా!

మనం ఈ ప్రపంచంలో ఒక భాగం. ఇక్కడ మనం జీవించగోరితే ఇక్కడ నుండి పుచ్చుకొన్నవాటిని తిరిగి యిచ్చేతీరాలి. ఆహారం, నీరు, ప్రాణవాయువు మొదలైన వాటిని పరిగ్రహిస్తాం; బొగ్గుపులుసు వాయువు, వ్యర్థపదార్థాలను తిరిగి ఇచ్చివేస్తున్నాం; తెలివిని పొందుతున్నాం, దాని సరైన ప్రక్రియలో ఉపయోగించడం ద్వారా తిరిగి ఇచ్చి వేస్తున్నాం. ప్రతి స్థితిలోను ఈ రీతిలో కొన్నిటిని పొందుతున్నాం, కొన్నిటిని తిరిగి ఇచ్చివేస్తున్నాం. ఇది యజ్ఞ విధి. జనసామాన్యంలో ప్రతి ఒక్కరూ ఈ నియమాన్ని పాటించి తీరాలి.

మనకు అందివ్వబడుతున్న లేక మనం ప్రపంచంనుండి పుచ్చు కొంటున్నవన్నీ మళ్లీ తిరిగి ఇవ్వడానికి అనే ఈ యజ్ఞవిధిని అవగతం చేసుకొని జీవింప ప్రయత్నిస్తే జీవితం ఆనందప్రదం అవుతుంది.

ఈ ప్రపంచ మహాయజ్ఞంలో ఒక చిన్న నమూనాయే అగ్నిలో ఆజ్యం పోసి చేసే యాగాలు. నెయ్యి మొదలైన ఆహుతులను అర్పిస్తాం.

వర్షం, స్వర్గపదవి వంటివి ప్రాప్తించుకొంటాం. ఈ భావాన్నే భగవద్గీత (3.11)'యజ్ఞం ద్వారా మీరు దేవతలను మెప్పించండి. దేవతలు (వర్షం ఇత్యాదులతో) మిమ్మల్ని సంతోషపరుస్తారు. ఇలా మీరు పరస్పరం ప్రియ మొనర్చుకొంటూ, పరమ శ్రేయాన్ని పొందుతారు' అని తెలుపుతున్నది.

సృష్టి సైతం ఇటువంటి మహాయజ్ఞం వలనే సంభవించిది. భగవంతుడు తననే ఆహుతించుకొని ఈ ప్రపంచాన్ని సృష్టించాడు.

పురుష సూక్తంలో రెండు కోవల సృష్టులు చెప్పబడినట్లు సాయనుడు వివరిస్తాడు. మొదటిది పూర్వసృష్టి, రెండవది ఉత్తరసృష్టి. పూర్వసృష్టిలో భగవంతుడు తనను ప్రపంచంగాను, అనేక ప్రాణులుగాను సృష్టించు కొన్నాడు. ఇది 4-5 మంత్రాలలో వివరింపబడింది. ఉత్తర సృష్టిలో ఆ ప్రాణులు జీవింప ఆహారంవంటి ఇతర పదార్థాలుగా పరిణమించాడు. ఈ విషయం 6వ మంత్రం నుండి వివరింపబడింది.

**త్రిపాదూర్ధ్వ ఉదైత్పురుషః । పాదోఽస్యేహాఽఽభవాత్పునః ।**

**తతో విష్వఙ్వ్యక్రామత్ । సాశనానశనే అభి ॥ 4**

త్రిపాద్ = ముప్పావు; పురుషః = భగవంతుడు; ఊర్ధ్వః = పైన; ఉదైత్ = నెలకొని ఉన్నాడు; అస్య = ఆయన; పాదః = పావుభాగం; ఇహ = ఇక్కడ; పునః = మళ్లీ; అభవాత్ = ఆవిర్భవించింది; తతః = తదనంతరం; సాశన అనశనే = ప్రాణులలో, జడపదార్థాలలో; విష్వఙ్ = అంతా; అభివ్యక్రామత్ = జొరబడి వ్యాపించాడు.

**తా॥** *భగవంతుని ముప్పాతిక భాగం పైన నెలకొని ఉంది. తక్కిన పావు బాగం యీ ప్రపంచంగా ఆవిర్భవించింది. తరువాత ఆయన ప్రాణుల జడపదార్థాలన్నిటిలో జొరబడి వ్యాపించాడు.*

**తస్మాద్విరాడజాయత । విరాజో అధి పూరుషః । స జాతో అత్యరిచ్యత । పశ్చాద్భూమిమథో పురః ॥ 5**

తస్మాత్ = ఆ ఆదిపురుషునినుండి; విరాట్ = బ్రహ్మాండము; అజాయత = ఉద్భవించింది; విరాజో అధి = బ్రహ్మాండంతోపాటు; పురుషః = బ్రహ్మ; జాతః = పుట్టి; అత్యరిచ్యత = సర్వత్రా వ్యాపించాడు; పశ్చాత్ = తదుపరి; సః = ఆయన; భూమిం = భూమిని; అతః = ఆ తరువాత; పురః = శరీరాలను.

**తా॥** *ఆ ఆదిపురుషునినుండి బ్రహ్మాండం సముద్భవించింది. బ్రహ్మాండంతోపాటు బ్రహ్మ ఆవిర్భవించి సర్వత్రా వ్యాపించాడు. తదనంతరం ఆయన భూమిని సృజించాడు. ఆ పిదప ప్రాణులకు శరీరాలను సృష్టించాడు.*

ఇక ఉత్తర సృష్టిని గురించి వివరిస్తున్నారు -

**యత్పురుషేణ హవిషా । దేవా యజ్ఞమతన్వత । వసంతో అస్యాసీదాజ్యమ్ । గ్రీష్మ ఇధ్మశ్శరద్ధవిః ॥ 6**

పురుషేణ హవిషా = భగవంతుడైన ఆహుతి ద్వారా; దేవాః = దేవతలు; యత్ = ఏ; యజ్ఞం = యజ్ఞాన్ని; అతన్వత = చేశారో; అస్య = దానికి; వసంతః = వసంత కాలం; ఆజ్యం = నెయ్యిగాను; గ్రీష్మః = గ్రీష్మ (వేసవి) కాలం; ఇధ్మః = వంటచెరకుగాను; శరత్ = శరత్కాలం; హవిః = నైవేద్యంగాను; ఆసీత్ = అయినవి.

**తా॥** *భగవంతుణ్ణి ఆహుతి వస్తువుగా చేసుకొని దేవతలు నిర్వర్తించిన యజ్ఞానికి వసంతకాలం నెయ్యిగాను, గ్రీష్మకాలం*

వంటచెరకుగాను, శరత్కాలం నైవేద్యంగాను అయినవి.

**సప్తాస్యాసన్పరిధయః । త్రిః సప్త సమిధః కృతాః ।**
**దేవాయద్యజ్ఞం తన్వానాః । అబధ్నన్పురుషం పశుమ్ ॥ 7**

అస్య = ఈ యజ్ఞానికి; సప్త = పంచభూతాలు, రాత్రి పగటితో ఏడు; పరిధయః = పరిధులుగా; ఆసన్ = అయినవి; త్రిస్సప్త = ఇరవైఒక్క తత్త్వాలు; సమిధః = సమిధలుగా; కృతాః = కాబడినవి; దేవాః = దేవతలు; యజ్ఞం = యజ్ఞాన్ని; తన్వానాం = చేసినవారుగా; యత్ పురుషం = ఆ బ్రహ్మను; పశుమ్ = హోమ పశువుగా; అబధ్నన్ = కట్టారు.

**తా॥** ఈ యజ్ఞానికి పంచభూతాలు, రాత్రి పగలు కలిసి ఏడూ పరిధులైనవి. ఇరవై ఒక్క తత్త్వాలు సమిధ లయినాయి. దేవతలు యాగాన్ని ఆరంభించి బ్రహ్మను హోమపశువుగా కట్టారు.

ప్రకృతిలోని వివిధ అంశాలు యీ ప్రపంచ యజ్ఞంలో వివిధ అంగాలుగా రూపుదాల్చాయి.

మొదట యజ్ఞం పరిధులు. పరిధి అన్నది యజ్ఞకుండం సరిహద్దురేఖ. దుష్టశక్తులనుండి యజ్ఞాన్ని రక్షించే నిమిత్తం ఇది అమర్చబడుతుంది. ఇక్కడ కుశగ్రాసమో, చెట్లో లేవు. ఎందుకంటే అప్పటికి సృష్టే ఆరంభం కాలేదు కనుక. అందుచేత యీ ప్రపంచ యజ్ఞంలో మట్టి, నీరు, అగ్ని, గాలి, ఆకాశం అనే పంచభూతాలు, రాత్రి పగలు పరిధులుగా అమర్చబడ్డాయి. ఇవి బాహ్యప్రకృతిని సూచిస్తూ నిలిచివున్నాయి.

యజ్ఞానికైన సమిధలుగా అంతర ప్రకృతి తీసుకోబడింది. కళ్లు, ముక్కు, చెవులు, నోరు, నాలుక అనే జ్ఞానేంద్రియాలు 5; కాలు, చేయి,

నోరు, మర్మాంగం, గుదం అనే కర్మేంద్రియాలు 5; ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమాన మనే ప్రాణాలు 5; మనస్సు, బుద్ధి, చిత్తం, అహంకారం అనే అంతఃకరణాలు 4; వీటితో పాటు ధర్మం, అధర్మం అయిన 21తత్త్వాలు ఆంతరిక ప్రకృతికి ప్రతీకగా నిలుస్తాయి.

ఈ విధంగా బాహ్య ఆంతరిక ప్రకృతులు యజ్ఞానికైన సమిధలైనాయి. సృష్టికర్తయైన బ్రహ్మదేవుడే బలి యివ్వబడే హోమపశువుగా చేయబడ్డాడు.

యజ్ఞం ప్రారంభమవుతుంది.

**తం యజ్ఞం బర్హిషి ప్రౌక్షన్ । పురుషం జాతమగ్రతః । తేన దేవా అయజంత । సాధ్యా ఋషయశ్చ యే ॥ 8**

అగ్రతః = మొదట; జాతం = పుట్టిన; తం = ఆ; యజ్ఞం పురుషం = యజ్ఞపురుషుడైన బ్రహ్మను; బర్హిషి = యాగంలో; ప్రౌక్షన్ = నీళ్లు చల్లారు; తేన = తరువాత; దేవా = దేవతలూ; సాధ్యాః = సాధ్యులూ; ఋషయఃచ = ఋషులూ; ఏ = ఎవరెవరున్నారో వారందరూ; అయజంత = యాగాన్ని కొనసాగించారు.

**తా॥** మొదట ఉద్భవించిన ఆ యజ్ఞపురుషుడైన బ్రహ్మపై నీళ్లుచల్లారు. పిదప దేవతలూ, సాధ్యులూ, ఋషులూ, ఎవరెవరున్నారో ఆ యావన్మందీ యాగాన్ని కొనసాగించారు.

స్వర్గంలో వసించేవారు దేవతలు, వైకుంఠవాసులు సాధ్యులు. బ్రహ్మపై నీళ్లుచల్లి పవిత్రీకరించడం మొదలైన విధులతో యజ్ఞం ప్రారంభమౌతుంది.

**తస్మాద్యజ్ఞాత్సర్వహుతః । సంభృతం పృషదాజ్యమ్ ।**

**పశూగ్‌స్తాగ్‌శ్చక్రే వాయవ్యాన్ । ఆరణ్యాన్గ్రామ్యాశ్చ యే ॥ 9**

సర్వహుతః = ప్రపంచ యజ్ఞమైన; తస్మాత్ యజ్ఞాత్ = ఆయాగంనుండి; పృషదాజ్యం = పెరుగు కలిసిన నెయ్యి; సంభృతం = ఉద్భవించింది; వాయవ్యాన్ = పక్షులను; ఆరణ్యాన్ = మృగాలను; యే = ఏవి; గ్రామ్యాశ్చ = సాధుమృగాలను; తాన్ పశూన్ = ఇతర ప్రాణులను; చక్రే = బ్రహ్మ సృజించాడు.

**తా॥** *ప్రపంచ యజ్ఞమైన ఆ యాగంనుండి పెరుగు కలిసిన నెయ్యి ఉద్భవించింది. పక్షులను, జింక పులివంటి వన్యమృగాలను, పశువు వంటి సాధుమృగాలను బ్రహ్మ సృజించాడు.*

**తస్మాద్యజ్ఞాత్సర్వహుతః । ఋచః సామాని జజ్ఞిరే । ఛందాగ్ంసి**

**జజ్ఞిరే తస్మాత్ యజుస్తస్మాదజాయత ॥ 10**

సర్వహుతః = ప్రపంచ యజ్ఞమైన; తస్మాత్ యజ్ఞాత్ = ఆ యాగం నుండి; ఋచః = ఋగ్వేదమంత్రాలూ; సామాని = సామవేద మంత్రాలూ; జజ్ఞిరే = ఉద్భవించాయి; తస్మాత్ = దానినుండి; ఛందాంసి = ఛందస్సులూ; జజ్ఞిరే = ఉత్పన్నమైనాయి; తస్మాత్ = అందుండి; యజుః = యజుర్వేదం; అజాయత = ఉద్భవించింది.

**తా॥** *ప్రపంచ యజ్ఞమైన ఆ యాగంలో నుండి ఋగ్వేద మంత్రాలూ, సామవేద మంత్రాలూ, గాయత్రీ ప్రభృత ఛందస్సులూ ఉద్భవించాయి. దానినుండే యజుర్వేదం సముద్భవించింది.*

శ్లోకాలు అమర్చే పద్ధతిని ఛందస్సుగా పేర్కొంటారు. అక్షరాల సంఖ్యను బట్టి ఏడు ఛందస్సులు తెలుపబడ్డాయి. గాయత్రీ ఛందస్సులో ఆరు అక్షరాలుంటాయి. అట్లే ఉష్ణితలో -7, అనుష్టుప్‌లో -8, బృహతిలో -9, పంక్తిలో -10, తుష్టుప్‌లో -11, జగతిలో -12 అక్షరాలుంటాయి.

**తస్మాదశ్వా అజాయంత । యే కే చోభయాదతః । గావో హ జజ్ఞిరే తస్మాత్ । తస్మాజ్జాతా అజావయః ॥ 11 ॥**

తస్మాత్ = దానిలోనుండే; అశ్వాః = గుర్రాలు,అజాయంత = ఉద్భవించాయి; యే కే ఉభయాదతః = రెండు వరుసల దంతాలుగల మృగాలూ; గావః చ = పశువులూ; తస్మాత్ = అందులోనుండే; జజ్ఞిరే = ఉత్పన్నమైనాయి; అజాః = గొర్రెలూ; ఆవయః = గేదెలు; జాతాః = ఉద్భవించాయి.

**తా॥** *అందులోనుండే గుర్రాలూ, రెండు వరుసల దంతాలుగల మృగాలూ, పశువులూ, గొర్రెలూ, గేదెలూ ఉద్భవించాయి.*

**యత్పురుషం వ్యదధుః । కతిధా వ్యకల్పయన్ । ముఖం కిమస్య కౌ బాహూ । కావూరూ పాదావుచ్యేతే ॥12 ॥**

యత్ = ఎప్పుడు; పురుషం = బ్రహ్మను; వ్యదధుః = బలి ఇచ్చారో; కతిధా = ఏ ఏ రూపాలుగా; వ్యకల్పయన్ = చేశారు; అస్య = ఆయన యొక్క; ముఖం = ముఖము; కిం = ఏదిగా; ఆసీత్ = అయినది; బాహూ = చేతులుగా; కౌ = ఏది; ఉచ్యేతే = చెప్పబడింది; ఊరూ = తొడలుగా; పాదౌ = పాదాలుగా; కౌ = ఏది; ఉచ్యేతే = చెప్పబడింది.

**తా॥** బ్రహ్మను దేవతలు బలియిచ్చినప్పుడు ఆయనను ఏఏ రూపాలుగా చేశారు? ఆయన ముఖం ఏదిగా అయింది? చేతులుగా ఏది చెప్పబడింది? తొడలుగా, పాదాలుగా ఏవి చెప్పబడ్డాయి?

**బ్రాహ్మణో-స్య ముఖమాసీత్ । బాహూ రాజన్యః కృతః ।**

**ఊరూ తదస్య యద్వైశ్యః । పద్భ్యాగ్ంం శూద్రో అజాయత ॥ 13 ॥**

అస్య = ఆయన యొక్క; ముఖం = ముఖము; బ్రాహ్మణః = బ్రాహ్మణుడుగా; ఆసీత్ = అయింది; బాహూ = చేతులు; రాజన్యః = క్షత్రియుడుగా; కృతః = చేయబడింది; అస్య = ఆయన యొక్క; ఊరూ = ఊరువులు (తొడలు); యత్ = ఏవో; తత్ = అవి; వైశ్యః = వైశ్యుడుగా అయింది; పద్భ్యాం = పాదాలనుండి; శూద్రః = శూద్రుడు; అజాయత = ఉద్భవించాడు.

**తా॥** ఆయన ముఖం బ్రాహ్మణుడుగా అయింది; చేతులు క్షత్రియుడుగా అయింది; తొడలు వైశ్యునిగా అయింది. ఆయన పాదాలనుండి శూద్రుడు ఉద్భవించాడు.

**చంద్రమా మనసో జాతః । చక్షోః సూర్యో అజాయత ।**

**ముఖాదింద్రశ్చాగ్నిశ్చ । ప్రాణాద్వాయురజాయత ॥ 14 ॥**

మనసః = మనస్సునుండి; చంద్రమా = చంద్రుడు; జాతః = పుట్టాడు; చక్షోః = కంటినుండి; సూర్యః = సూర్యుడు; అజాయత = పుట్టాడు; ముఖాత్ = ముఖం నుండి; ఇంద్రః చ = ఇంద్రుడూ; అగ్నిః చ = అగ్నీ ఉద్భవించారు; ప్రాణాత్ = ప్రాణం నుండి; వాయుః = వాయువు; అజాయత = ఉద్భవించాడు.

**తా॥** మనస్సునుండి చంద్రుడు ఉద్భవించాడు. కంటి నుండి సూర్యుడు, ముఖం నుండి ఇంద్రాగ్నులు ఉద్భవించారు. ప్రాణం నుండి వాయివు ఉత్పన్నమైనాడు.

**నాభ్యా ఆసీదంతరిక్షమ్ । శీర్ష్ణో ద్యౌః సమవర్తత । పద్భ్యాం భూమిర్దిశః శ్రోత్రాత్ । తథా లోకాగ్ం అకల్పయన్ ॥15॥**

నాభ్యా = నాభి (బొడ్డు) నుండి; అంతరిక్షం = అంతరిక్షము (ఆకాశం); ఆసీత్ = ఉద్భవించింది; శీర్ష = శిరస్సునుండి; ద్యౌః = స్వర్గం; సమవర్తత = సముద్భవించింది; పద్భ్యాం = పాదాలనుండి; భూమిః = భూమి; శ్రోత్రాత్ = చెవినుండి; దిశః = దిశలు; తథా = అట్లే; లోకాన్ = లోకాలన్నీ; అకల్పయన్ = ఉద్భవించాయి.

**తా॥** *నాభి నుండి అంతరిక్షం ఉద్భవించింది. శిరస్సునుండి స్వర్గం సముద్భవించింది. పాదాలనుండి భూమి, చెవినుండి దిశలు ఉత్పన్న మైనాయి. అట్లే సమస్త లోకాలూ ఉద్భవించాయి.*

ఏ భగవంతుడు వేయి తలలు గలవాడని పేర్కోబడ్డాడో, ఎవరు తననే యజ్ఞవస్తువుగా గావించుకొని యీ ప్రపంచాన్ని మనం జీవింప అమర్చి యిచ్చాడో ఆ భగవంతుడికీ మనకూ ఉన్న సంబంధం ఏమిటి? ఈ ప్రపంచాన్ని ప్రాప్తించుకొన్న మనం చేయవలసింది ఏమిటి? ఆయనను తెలుసుకోవడమే.

**వేదాహమేతం పురుషం మహాంతమ్ । ఆదిత్యవర్ణం తమసస్తు పారే । సర్వాణి రూపాణి విచిత్య ధీరః । నామాని కృత్వాఽభివదన్ యదాస్తే ॥ 16 ॥**

సర్వాణి = సమస్త; రూపాణి = రూపాలను; విచిత్య = సృజించి; నామాని = పేర్లనుకూడ; కృత్వా = కూర్చి; యత్ = ఏ; ధీరః = భగవంతుడు; అభివదన్ ఆస్తే = క్రియాశీలుడై ఉన్నాడో; మహాంతమ్ = మహిమాన్వితుడైన; ఆదిత్యవర్ణం = సూర్యునిలా ప్రకాశించేవాడూ; తమసః తు = అంధకారానికి; పారే = దూరంగా ఉన్నవాడూ; తం పురుషమ్ = ఆ భగవంతుని; అహం = నేను; వేద = తెలుసుకొన్నాను.

**తా॥** *సమస్త రూపాలను సృష్టించి, పేర్లనూ కూర్చి ఏ భగవంతుడు క్రియాశీలుడై ఉంటూ,మహిమాన్వితుడూ, సూర్యునిలా ప్రకాశించేవాడూ, అంధకారానికి సుదూరుడూ అయిన భగవంతుని నేను తెలుసుకొన్నాను.*

'ఆ భగవంతుణ్ణి నేను తెలుసుకొన్నాను' అన్న ఋషి వచనాన్ని 'ఆ భగవంతుని నేను తెలుసుకోవాలి'గా గ్రహించి మనం కార్యోన్ముఖులం కావాలి. ఎందుకంటే, 'పరిపూర్ణత్వాన్ని పొందిన ఋషులు తమ జీవితంలో ఆవిష్కరించుకొన్న సనాతన సత్యాలను మనం సాధనగా అనుష్ఠించాలి. అప్పుడు ఆ సత్యాలను మనంకూడ ప్రాప్తించుకోవచ్చు' అనే మహాత్ములు వచించారు. అదే మనం చేయదగింది.

అలా ఆ భగవంతుని తెలుసుకొన్నందున ఏం లభిస్తుంది?

**ధాతా పురస్తాద్యముదాజహార । శక్రః ప్రవిద్వాన్ప్రదిశశ్చతస్రః తమేవం విద్వానమృత ఇహ భవతి । నాన్యః పంథా అయనాయ విద్యతే ॥17॥**

యం = ఏ భగవంతుని; ధాతా = బ్రహ్మ; పురస్తాత్ = ఆదిలో; ఉదాజహార = పరమాత్మ అని గ్రహించి చెప్పాడో; శక్రః = ఇంద్రుడు;

ప్రదిశః చతస్రః = నాలుగు దిశలలో యావత్తు; ప్రవిద్వాన్ = చక్కగా దర్శించాడో; తం = ఆయునను; ఏవం = ఇలా; విద్వాన్ = తెలుసుకొనేవాడు; ఇహ = ఇక్కడే; అమృతః = ముక్తుడుగా; భవతి = అవుతాడు; అయనాయ = మోక్షానికి; అన్యః = ఇతర; పంథా = మార్గం; న విద్యతే = లేదు.

**తా॥** *ఏ భగవంతుని బ్రహ్మ ఆదిలో పరమాత్మగా దర్శించి తెలిపాడో, ఇంద్రుడు నాలుగు దిశలలో యావత్తు చక్కగా చూశాడో, ఆయనను ఇలా గ్రహించినవాడు ఇక్కడే, అంటే ఈ జన్మలోనే ముక్తుడవుతాడు. అనగా జీవన్ముక్తుడు అవుతాడు. మోక్షానికి మరో మార్గంలేదు.*

**యజ్ఞేన యజ్ఞమయజంత దేవాః । తాని ధర్మాణి ప్రథమాన్యాసన్ । తే హ నాకం మహిమానః సచంతే । యత్ర పూర్వే సాధ్యాః సంతి దేవాః ॥ 18 ॥**

దేవాః = దేవతలు; యజ్ఞేన = ఈ యజ్ఞం ద్వారా; యజ్ఞం = భగవంతుని; అయజంత = పూజించారు; తాని = అవి; ప్రథమాని = ప్రప్రథమ; ధర్మాణి = ధర్మాలు; ఆసన్ = అయినవి; యత్ర = ఎక్కడ; పూర్వే = ఆరంభంలో; సాధ్యాః = సాధ్యులూ; దేవాం = దేవతలూ; సంతి = ఉన్నారో; నాకం = ఉన్నత లోకాన్ని; తే మహిమానః = ఆ మహాత్ములు; సచంతే = పొందుతారు.

**తా॥** *దేవతలు ఈ యజ్ఞం ద్వారా భగవంతుని ఆరాధించారు. అవి ప్రప్రథమ ధర్మాలుగా రూపొందాయి. ప్రారంభంలో ఎక్కడ యజ్ఞం ద్వారా భగవంతుణ్ణి ఆరాధించిన సాధ్యులూ, దేవతలూ వసిస్తూన్నారో, ధర్మాన్ని ఆచరించే మహాత్ములు ఆ ఉన్నత లోకాన్ని ప్రాప్తించుకుంటారు.*

దేవతలు ఈ మహాప్రపంచ యజ్ఞాన్ని నిర్వర్తించినందున ఉన్నతలోకాన్ని చేరుకొన్నారు. ఈ యజ్ఞాన్ని చేసేవారు సైతం ఆ లోకాన్ని చేరుకోగలరు. ఈ యజ్ఞం చేయడం ప్రధాన ధర్మమనీ, దీనిని ఆచరించేవారు మహాత్ములనీ శ్లాఘించడం గమనార్హం.

ఇంతవరకూ చూసిన 18 మంత్రాలతో పురుషసూక్తం పూర్తవుతుంది. కాని దక్షిణాదిలో సామాన్యంగా పురుషసూక్తాన్ని ఉత్తర నారాయణం, నారాయణ సూక్తం, విష్ణు సూక్తాల మొదటి మంత్రంతో కలిపే పారాయణ చేస్తారు. అందుచేత వాటిని పొందుపరుస్తున్నాం. ఉత్తర నారాయణ భాగం పురుషసూక్త భావాన్ని క్లుప్తంగా తెలుపుతుంది.

**అద్భ్యః సంభూతః పృథివ్యై రసాచ్చ । విశ్వకర్మణః సమవర్తతాధి । తస్య త్వష్టా విదధద్రూపమేతి । తత్పురుషస్య విశ్వమాజానమగ్రే ॥ 19 ॥**

అద్భ్యః = నీటినుండీ; పృధివ్యై = భూమియొక్క; రసాత్ = సారమైన అంశంనుండీ; సంభూతః = ప్రపంచం ఉద్భవించింది; విశ్వకర్మణః = విశ్వాన్ని సృజించిన భగవంతునినుండి; అది = శ్రేష్ఠుడు; సమవర్తత = ఉద్భవించాడు; త్వష్టా = భగవంతుడు; తస్య = బ్రహ్మయొక్క; రూపం = రూపాన్ని; విదధత్ = రూపొందించి; ఏతి = వ్యాపించి ఉన్నాడు; తత్ = ఆ; పురుషస్య = బ్రహ్మయొక్క; విశ్వం = ఈ ప్రపంచరూపు; అగ్రే = ఆదిలో; అజానం = ఉద్భవించింది.

**తా॥** *నీటినుండీ, భూసారాంశంనుండీ ప్రపంచం ఉద్భవించింది. ప్రపంచాన్ని సృజించిన భగవంతునుండి శ్రేష్ఠుడైన బ్రహ్మ ఉద్భవించాడు. భగవంతుడు ఆ బ్రహ్మ (పద్నాలుగు లోకాలు*

నిండిన) రూపాన్ని చక్కదిద్ది దాన్లో వ్యాపించివున్నాడు. బ్రహ్మయొక్క యీ ప్రపంచ రూపు సృష్ట్యాదిలో ఉద్భవించింది.

**వేదాహమేతం పురుషం మహాన్తమ్ । ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్ । తమేవం విద్వానమృత ఇహ భవతి । నాన్యః పంథా విద్యతేఽయనాయ ॥20॥**

మహాన్తమ్ = మహిమాన్వితుడైన; ఆదిత్యవర్ణం = సూర్యునిలా ప్రకాశించేవాడూ; తమసః = అంధకారానికి; పరస్తాత్ = సుదూరుడూ; ఏతం = ఈ; పురుషం = భగవంతుని; అహం = నేను; వేద = ఎరుగుదును; తం = ఆయనను; ఏవం = ఇలా; విద్వాన్ = తెలుసుకొనేవాడు; ఇహ = ఇక్కడ; ముక్తః = ముక్తుడుగా; భవతి = అవుతాడు; అయనాయ = ముక్తికి; అన్యః = వేరు; పంథా = దారి; న విద్యతే = లేదు.

**తా॥** మహిమాన్వితుడూ, సూర్యునిలా ప్రకాశమానుడూ, అంధకారానికి సుదూరుడూ అయిన భగవంతుని నేను ఎరుగుదును. ఆయనను ఇలా తెలుసుకొనేవాడు యిక్కడే ఈ జన్మలోనే ముక్తుడవుతాడు. ముక్తికి మరో దారిలేదు.

ఒక వ్యక్తి ముక్తిని, భగవంతుని ఎందుకు ఆకాంక్షించాలి?

**ప్రజాపతిశ్చరతి గర్భే అంతః । అజాయమానో బహుధా విజాయతే తస్య ధీరాః పరిజానంతి యోనిమ్ । మరీచీనాం పదమిచ్ఛంతి వేధసః ॥ 21**

ప్రజాపతి: = భగవంతుడు; గర్భే అంత: = ప్రపంచం లోపల; చరతి = సంచరిస్తున్నాడు; అజాయమాన: = జన్మించనివాడిగా ఉంటూనే; బహూధా = అనేక రూపాలతో; విజాయతే = ఉద్భవిస్తున్నాడు; తస్య = ఆయనయొక్క; యోనిమ్ = నిజస్వరూపాన్ని; ధీరా: = మహాత్ములు; పరిజానంతి = చక్కగా ఎరుగుదురు; వేధస: = బ్రహ్మవంటివారు; మరీచీనాం = మరీచి ప్రభృత మహాత్ముల; పదం = పదవిని; ఇచ్ఛంతి = అభిలషిస్తున్నారు.

**తా॥** *భగవంతుడు జన్మలేనివాడుగా ఉంటూనే ప్రపంచంలో క్రియాశీలుడై, అనేక రూపాలతో ఉద్భవిస్తున్నాడు. ఆయన నిజ స్వరూపాన్ని మహాత్ములు చక్కగా ఎరుగుదురు. బ్రహ్మవంటి వారు సైతం మరీచి మొదలైన మహాత్ముల పదవిని ఆకాంక్షిస్తున్నారు.*

భగవదనుభూతి విశిష్టత యిక్కడ ప్రస్తావింపబడింది. మానవుడు పొందదగిన పదవులలో అత్యున్నతమైనది బ్రహ్మపదం. కోట్లాది సం॥లుగా కొనసాగే మహాప్రళయ సమయంలో, అంటే ఈ సృష్టి అంతానికి వచ్చినప్పుడు ఆయన పదవీకాలం కూడ సమాప్తమవుతుంది. కాని భగవదనుభూతి పొందిన, ముక్తుడైన మహాత్ముల స్థితి అటువంటిది కాదు. 'బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి' – భగవంతుణ్ణి తెలుసుకొన్నవాడు భగవంతుడే అవుతాడు. ఆతడికి మరణం లేదు, వినాశం లేదు. అందుచేతనే బ్రహ్మవంటి దేవతలు సైతం భూలోకంలో ఋషులై ఉండ అభిలషిస్తారు. అందుచేత మనిషిగా పుట్టిన ప్రతి వ్యక్తీ భగవంతుణ్ణి అన్వేషించాలి. ఇదే ప్రశంసనీయమైన కార్యం.

**యో దేవేభ్య ఆతపతి । యో దేవానాం పురోహితః । పూర్వో**
**యో దేవేభ్యో జాతః । నమో రుచాయ బ్రాహ్మయే ॥ 22**

యః = ఎవరు; దేవేభ్యః = దేవతలకు; ఆతపతి = తేజస్సుగా ఉంటున్నాడో; యః = ఎవరు; దేవానాం = దేవతలకు; పురోహితః = గురువుగా ఉంటున్నాడో; యః = ఎవరు; దేవేభ్యః = దేవతలకు; పూర్వః = పూర్వమే; జాతః = పుట్టాడో; రుచాయ = ప్రకాశమానమైన; బ్రాహ్మయే = భగవంతునికి; నమః = నమస్కారము.

**తా॥** *ఎవరు దేవతలకు తేజస్సుగా వెలుగొందుతున్నాడో, దేవతల గురువుగా భాసిస్తున్నాడో, దేవతలకంటే పూర్వమే ఉద్భవించాడో, ఆ ప్రకాశమానుడైన భగవంతునికి నమస్కారము.*

**రుచం బ్రాహ్మం జనయంతః । దేవా అగ్రే తదబ్రువన్ ।**
**యస్త్వైవం బ్రాహ్మణో విద్యాత్ । తస్య దేవా అసన్ వశే ॥ 23**

బ్రాహ్మం = భగవంతుని గురించిన; ఋచం = సత్యాన్ని; జనయంతః = తెలిపేటప్పుడు; దేవాః = దేవతలు; అగ్రే = ఆదిలో; తత్ = దానిని గురించి; అబ్రువన్ = చెప్పారు; యః తు = ఎవరైనప్పటికి; బ్రాహ్మణః = భగవంతుని అన్వేషించేవాడు; ఏవం = ఇలా; విద్యాత్ = తెలుసుకొంటే; తస్య = ఆతడికి; దేవాః = దేవతలు; వశే = వశవర్తులుగా; అసన్ = ఉంటారు.

**తా॥** *భగవంతుని గురించిన సత్యాన్ని తెలిపేటప్పుడు దేవతలు ఆదిలో దానిని గురించి ఇలా అన్నారు "భగవంతుణ్ణి అన్వేషించేవారు ఎవరైనప్పటికీ ఇలా తెలుసుకొన్నాడంటే ఆతడికి దేవతలు వశవర్తులై ఉంటారు."*

**హ్రీశ్చ తే లక్ష్మీశ్చ పత్న్యౌ । అహోరాత్రే పార్శ్వే । నక్షత్రాణి**
**రూపమ్ । అశ్వినౌ వ్యాత్తమ్ ॥ 24**

హ్రీః చ = హ్రీ దేవీ; లక్ష్మీః చ = లక్ష్మీదేవీ; తే = మీ; పత్న్యౌ = పత్నులు; అహోరాత్రే = రేయింబవళ్లు; పార్శ్వే = పార్శ్వాలు (ఇరువంకలు); నక్షత్రాణి = నక్షత్రాలు; రూపమ్ = దివ్యరూపం; అశ్వినౌ = అశ్వినీదేవతలు; వ్యాత్తమ్ = వికసిత వదనం.

**తా॥** *లజ్జాస్వరూపిణియైన హ్రీదేవీ, సిరులకు ఆలవాలమైన లక్ష్మీ దేవీ నీ అర్ధాంగినులు. రేయింబవళ్లు నీ పార్శ్వాలు. నక్షత్రాలు నీ దివ్యరూపం. అశ్వినీదేవతలు నీ వికసిత వదనం.*

రేయింబవళ్లన్నది కాలాన్ని సూచిస్తుంది. ఎలా ఒక దేహాన్ని దాని పార్శ్వాలు భరిస్తాయో, అట్లే సృష్టికి కాలం ఆధారభూతమై ఉంది. నక్షత్రాలన్నవి సృష్టిని సూచిస్తాయి. మనం చూసే యీ జగత్తు భగవంతునిలో ఒక భాగం మాత్రమే, అత్యధికభాగం ఊర్ధ్వలోకంలో ఉందని యీ సూక్తంలో (3) చూశాం. కంటికి కానవచ్చే యీ సృష్టే ఇంత మహిమాన్వితమైనదిగా, అపారమై ఉన్నప్పుడు ఈ సృష్టికి కర్తయైన భగవంతుని మహిమ ఎంత మహోన్నతమో గుర్తించి మనం ఆయన మహిమలో లయింప సృష్టి ఆయన స్వరూపం అని పేర్కొబడింది. నక్షత్రాలు, సూర్యుడు, చంద్రుడు, సాగరం, పర్వతాలు, చెట్లు-ఇత్యాదియైన సృష్టిలో ప్రతి అంశమూ మనకు దానికి నేపథ్యంలో ఉండి పనిచేయించే దివ్యప్రకాశమానుని జ్ఞప్తికి తేవాలి.

**ఇష్టం మనిషాణ । అముం మనిషాణ । సర్వం మనిషాణ॥**

**25**

ఇష్టం = మేం కోరిన దానిని; మనిషాణ = ప్రసాదించి కటాక్షించు; అముం = ఈ ప్రపంచ సుఖాన్ని; మనిషాణ = అనుగ్రహించి కటాక్షించు; సర్వం = సమస్తాన్ని; మనిషాణ = ప్రసాదించి కరుణించు.

**తా॥** ఓ భగవంతుడా! మేం కోరుకొన్న దానిని ప్రసాదించి కరుణించు. ఈ ప్రపంచ సుఖాన్ని ఒసగి మమ్ము కరుణించు. ఇహపరాలలో సమస్తాన్ని ప్రసాదించి కరుణించు.

ఓం తచ్ఛం యోరావృణీమహే । గాతుం యజ్ఞాయ । గాతుం యజ్ఞపతయే । దైవీ స్వస్తిరస్తు నః । స్వస్తిర్మానుషేభ్యః। ఊర్ధ్వం జిగాతు భేషజమ్ । శం నో అస్తు ద్విపదే । శం చతుష్పదే ॥

ఓం శాంతిః శాంతిః శాంతిః ॥





# నారాయణ సూక్తమ్

**ఓం సహ నావవతు । సహ నౌ భునక్తు । సహ వీర్యం కరవావహై । తేజస్వినావధీతమస్తు మా విద్విషావహై ॥**

**ఓం శాంతిః శాంతిః శాంతిః ॥**

సహనౌ = మనల నిద్దరినీ; అవతు = రక్షించుగాక!; సహనౌ = మన ఇద్దరినీ; భునక్తు = పోషించుగాక; సహ = కలసి; వీర్యం = మిక్కిలి ఉద్యమంతో; కరవావహై = పరిశ్రమిస్తాముగాక; అధీతమ్ = స్వాధ్యాయం; నౌ = మనకు; తేజస్వి = తేజోవంతం; అస్తు = అగుగాక; మా విద్విషావహై = ద్వేషించుకొనకుందాం గాక!

**తా॥** *గురు శిష్యులమైన మన ఇద్దరినీ భగవంతుడు రక్షించుగాక! ఇద్దరనూ పోషించుగాక! ఇద్దరమూ ఊర్జితశక్తితో పరిశ్రమిద్దాం గాక! మన స్వాధ్యాయం ఏకాగ్రమూ ఫలవంతమూ అగుగాక! ఎన్నడూ మన మిద్దరమూ నరస్పరం ద్వేషించుకొనకొందాంగాక!*

సామాన్యంగా దీనిని పురుషసూక్తంతో కలిసి పారాయణ చేయడం కద్దు. ఈ సూక్తం ధ్యానపద్ధతిని వివరిస్తుంది. ధ్యానం చేయడానికి ముందుగా యీ సూక్తాన్ని పారాయణ చేసి దీని భావాన్ని చింతన చేస్తూవుండడం ప్రగాఢ ధ్యానానికి దోహదం చేస్తుంది.

మొదట భగవంతుని మహిమ తెలుపబడింది. పిదప ఆయనను ఎక్కడ, ఎలా ధ్యానించాలో పేర్కోబడింది. క్రమంగా ధ్యానంలో మనస్సును ఎలా లగ్నం చేయాలో అన్న విషయం ఈ సూక్తంలో అద్భుత రీతిలో వివరింపబడింది.

ధ్యానం అంటే భగవంతుని సన్నిధానంలో ఉండటం; ఒక చిత్తరు వునో, ఒక రూపాన్నో ఊహించుకుంటూ ఉండడమో, తదేకంగా చూస్తూ ఉండడమో కాదు. ఆయన దివ్య సన్నిధానంలో మన ఉనికిని గ్రహించాలి. ఆయన దివ్యతేజంతో సజీవంగా వీక్షించి ఉండడాన్ని మానసికంగా దర్శించాలి.

అందు నిమిత్తం ముందు ఆ భగవంతుని మహిమను మొదటి ఐదు మంత్రాలు తెలుపుతున్నాయి-

**ఓం॥ సహస్రశీర్షం దేవం విశ్వాక్షం విశ్వశంభువమ్ ।**
**విశ్వం నారాయణం దేవమక్షరం పరమం పదమ్ । 1**

సహస్రశీర్షం = వేలాది తలలు గలవాడూ; దేవం = ప్రకాశిస్తూన్న వాడూ; విశ్వాక్షం = సమస్తాన్ని చూస్తూన్నవాడూ; విశ్వశంభువమ్ = యావ త్ప్రపంచానికీ మంగళకరుడూ; విశ్వం = ప్రపంచమై ఉన్నవాడూ; అక్షరం = నాశం లేనివాడూ; పరమంపదమ్ = అత్యున్నతస్థితి అయినవాడూ; నారాయణం దేవం = నారాయణుడనే దైవాన్ని.

**తా॥** వేలాది తలలు గలవాడూ, ప్రకాశిస్తూన్నవాడూ, సమస్తాన్ని చూస్తున్నవాడూ, యావత్ప్రపంచానికీ మంగళకరుడూ, నాశంలేనివాడూ, అత్యున్నత స్థితి అయినవాడూ అయిన నారాయణుడనే దైవాన్ని ధ్యానిస్తాను.

**విశ్వతః పరమాన్నిత్యం విశ్వం నారాయణగ్ం హరిమ్ ।**
**విశ్వమేవేదం పురుషస్తద్విశ్వముపజీవతి ॥ 2**

విశ్వత: = ఈ విశ్వానికన్నా; పరమాత్ = ఉన్నతుడూ; నిత్యం = నిత్యుడూ; విశ్వం ఈ ప్రపంచంగా ఉంటూన్నవాడూ; హరిమ్ = భక్తుల కష్టాలను బాపువాడూ; నారాయణం = నారాయణుని.

**తా॥** *ఈ విశ్వానికన్నా ఉన్నతుడూ, నిత్యుడూ, యీ విశ్వమై ఉంటూన్నవాడూ, భక్తుల కష్టాలను బాపువాడూ అయిన నారాయణుని ధ్యానిస్తాను.*

**పతిం విశ్వస్యాత్మేశ్వరగ్ం శాశ్వతగ్ం శివమచ్యుతమ్।**

**నారాయణం మహాజ్ఞేయం విశ్వాత్మానం పరాయణమ్ ॥ 3**

విశ్వస్య = విశ్వానికి; పతిం = నాధుడూ; ఆత్మ ఈశ్వరగ్ం = జీవులకు ఈశ్వరుడూ; శాశ్వతగ్ం = శాశ్వతుడూ; అచ్యుతమ్ = వినాశం లేనివాడూ; శివం = మంగళ స్వరూపుడూ; మహాజ్ఞేయం = విశిష్టంగా తెలుసుకోవలసినవాడూ; విశ్వ ఆత్మానం = అన్నిటికీ ఆత్మగా ఉన్నవాడూ; పరాయణమ్ = శరణు పొందదగిన శ్రేష్ఠుడూ; నారాయణం = నారాయణుని.

**తా॥** *విశ్వానికి నాధుడూ, జీవులకు ఈశ్వరుడూ, శాశ్వతుడూ, మంగళరూపుడూ, వినాశం లేనివాడూ, విశిష్టంగా తెలుసుకోవలసిన వాడూ, సమస్తానికీ ఆత్మయై ఉన్నవాడూ, శరణు పొందదగిన ఉత్కృష్టుడూ అయిన నారాయణుని ధ్యానిస్తాను.*

**నారాయణపరో జ్యోతిరాత్మా నారాయణః పరః ।**

**నారాయణపరం బ్రహ్మ తత్త్వం నారాయణః పరః ।**

**నారాయణపరో ధ్యాతా ధ్యానం నారాయణః పరః ॥ 4**

నారాయణః పరః జ్యోతిః = సాక్షాత్తు నారాయణుడే పరంజ్యోతి; నారాయణః పరః ఆత్మా = నారాయణుడే పరమాత్మ; నారాయణః పరంబ్రహ్మ = నారాయణుడే పరబ్రహ్మం; నారాయణః పరః తత్త్వం = నారాయణుడే పరతత్త్వం; నారాయణః పరః ధ్యాతా = ధ్యానించే వారిలో శ్రేష్ఠుడు నారాయణుడే; నారాయణః పరః ధ్యానం = నారాయణుడే శ్రేష్ఠమైనధ్యానం.

**తా॥** *నారాయణుడే పరంజ్యోతి, నారాయణుడే పరమాత్మ, నారాయణుడే పరబ్రహ్మం, నారాయణుడే పరతత్త్వం, ధ్యానించే వారిలో శ్రేష్ఠుడు నారాయణుడే, నారాయణుడే ఉత్కృష్టమైన ధ్యానం.*

ఇన్ని మహిమలతో విరాజిల్లుతూవున్న భగవంతుడు మన అంతరంగంలోనే నెలకొని ఉన్నాడని తదుపరి మంత్రం తెలుపుతుంది.

**యచ్చ కించిజ్జగత్సర్వం దృశ్యతే శ్రూయతేఽపి వా।**
**అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః ॥ 5**

జగత్ సర్వం = ప్రపంచం అంతటా; యచ్చ కించిత్ = కానవచ్చేది ఏదైనా; అపివా = లేక; శ్రూయతే = వినబడేది ఏదైనా; తత్సర్వం = ఆ సమస్తం; అతః = లోపల; బహిఃచ = వెలుపల; వ్యాప్య = పరివ్యాపించి; నారాయణః = నారాయణుడు; స్థితః = ఉంటున్నాడు.

**తా॥** *ఈ ప్రపంచం అంతటా కనిపిస్తూవున్నది ఏదైనా, వినిపిస్తూ వున్నది ఏదైనా వాటన్నిటా లోపలా వెలుపలా పరివ్యాపించి నారాయణుడే నెలకొని ఉంటున్నాడు.*

ఇది ధ్యానం తదుపరి మెట్టు. మొదట మనస్సు సర్వవ్యాపియైన భగవంతుని స్మరించడంలో నిమగ్నం అయింది. ఇప్పుడు దాని పరిధి

సంకోచింపబడింది. వ్యాపితమైన మనస్సు మనలో ఒకటిగా కలిసి పోయింది.

ధ్యానం తుది మెట్టుగా మనస్సు హృదయసీమలో కేంద్రీకృతం కావడం గురించి యీ మంత్రం తెలియచేస్తూన్నది.

**అనంతమవ్యయం కవిగ్ం సముద్రేఽంతం విశ్వశంభువమ్।**
**పద్మకోశప్రతీకాశగ్ం హృదయం చాప్యధోముఖమ్ ॥ 6**

అనంతం = అనంతమైన; అవ్యయం = వినాశం లేనిది; కవిగ్ం = సర్వజ్ఞుడూ; సముద్రే = సంసార సాగరంలోని; అంతం = అంతాన ఉండు వాడూ; విశ్వశంభువమ్ = యావద్విశ్వానికీ మంగళకరుడూ; హృదయంచ అపి = హృదయంలో; అధోముఖం = అధోముఖంగా; పద్మకోశ ప్రతీకాశగ్ం = తామర మొగ్గలా.

**తా॥** అనంతుడూ, అవినాశుడూ, సర్వజ్ఞుడూ, సంసార సాగర అంతాన ఉండేవాడూ, యావత్ప్రపంచానికీ మంగళకరుడూ అయిన నారాయణుని అధోముఖమైన తామరమొగ్గలా ఉన్న హృదయంలో ధ్యానిస్తాను.

'సముద్రే అంతం' అనే పదం ఇక్కడ గమనార్హం. సంసార సాగరాంతాన భగవంతుడు ఉన్నట్లుగా తెలుపబడింది. వాంఛలు, భావోద్వేగాలు అనే అలలతో అల్లకల్లోలితమైన జీవితమే సంసార సాగరంగా పేర్కొబడింది. వాంఛలు, భావోద్వేగాలు అనే అలలు ఉధృతమై ఉన్నంత వరకు ధ్యానం మూలంగా భగవంతుని దరి చేరలేము. మనస్సు ప్రశాంత మైనప్పుడే ధ్యానం కుదురుతుంది.

1. అలా అయితే వాంఛలు ఉడిగిన వారు మాత్రమే ధ్యానం చేయగలుగుతారా? అవును! ఇక్కడ మనం ఒక విషయం జ్ఞప్తిలో ఉంచుకోవాలి భగవంతుని, భగవదనుభూతిని పొందే నిమిత్తం చేసే ధ్యానం ఉత్కృష్ట కోవకు చెందుతుంది. సామాన్యంగా నేడు ధ్యానం పేరిట చలామణీ అవుతూవున్నది మామూలు ధ్యానం. ఇదికేవలం మనస్సు కేంద్రీకరణకు మాత్రమే పరిమితం. దీని ఉద్దేశం మానసిక ఉద్రిక్తత, ఒత్తిడి యిత్యాదుల నుండి తేరుకొని ప్రశాంత జీవితం గడపడం. ఈ రెండు కోవలకు చెందిన ధ్యానాలను గురించి సవివరంగా తెలుసుకోవడానికి మా మఠ ప్రచురణ 'ధ్యానం' (సంపాదకుడు: స్వామి భజనానంద) చూడండి.

హృదయం ఉన్న స్థానం తెలుపబడుతున్నది -

**అధో నిష్ట్యా వితస్త్యాంతే నాభ్యాముపరి తిష్ఠతి ।**
**జ్వాలమాలాకులం భాతీ విశ్వస్యాయతనం మహత్ ॥ 7**

నిష్ట్యా = కంఠం వద్ద; అధః = క్రింద; నాభ్యాం = నాభికి; ఉపరి = పైన; వితస్త్యాః అంతే = జానెడు దూరంలో; తిష్ఠతి = ఉన్నది; విశ్వస్య = ప్రపంచానికి అంతటికీ; మహత్ = విశిష్టమైన; ఆయతనం = ఆవాస స్థానం; జ్వాలమాలాకులం = దీపశిఖల వరుసతో ఆవృతమైనట్లు; భాతీ = ప్రకాశిస్తూన్నది.

**తా॥** *కంఠానికి క్రిందుగా, నాభి పైభాగానికి జానెడు దూరంలో ఉన్నది. ప్రపంచానికి అంతటికీ విశిష్టమైన ఆవాస స్థానమై, దీప శిఖల వరుసతో ఆవృతమైనట్లు ప్రకాశిస్తూన్నది.*

హృదయం గురించి చెప్పబడింది. 'లబ్ డబ్' అని కొట్టుకొంటూన్న భౌతిక హృదయం కాదు ఇది. భౌతిక హృదయమే అయినప్పుడు స్థానాన్ని గురించి ప్రస్తావింప అవసరం లేదు. అది ఎక్కడ ఉంటుందో అందరికీ తెలిసిన సంగతే. ఇది పారమార్థిక హృదయం. దీనికి మూడు లక్షణాలు. ఒకటి, నాభికి జానెడు దూరంలో ఉంది. భౌతిక హృదయమూ అంతే దూరంలో ఉంది కాని అది కాస్త ఎడమ వైపుగా ఉంది. కాని ఆధ్యాత్మిక హృదయం మధ్యలో ఉంది. రెండవది, దీపశిఖల వరుసతో ఆవృతమై ఉంది. మూడవది, ఆ హృదయం దేదీప్యమానమైనది. ఈ మూడు లక్షణాలు భౌతిక హృదయానికి వర్తించవు. కాని దీనిని మనం గ్రహించకున్నామే! గ్రహించకున్నప్పటికీ అది అక్కడ ఉండనే ఉంది.

హృదయంలో ధ్యానించాలని తెలుసుకొని అనేకులు యీ భౌతిక హృదయ స్థానాన మనస్సును కేంద్రీకరింప ప్రయత్నిస్తారు. కాని ఇది చివరిదాకా కేవలం ప్రయత్నంగానే ఉండిపోతుందేగాని ధ్యానం మాత్రం విజయవంతం కాదు. ఎందుకంటే, ధ్యానం మనస్సుకు సంబంధించినది కనుక. మనం ధ్యానించవలసింది ఆధ్యాత్మిక హృదయం లేక హృదయకమలంలో. నిజానికి అక్కడ మాత్రమే ధ్యానింప సాధ్యమౌతుంది. అనేకులలో యీ ఆధ్యాత్మిక హృదయం వికసించక మొగ్గగానే ఉండిపోవడం కద్దు. మొదట దాన్ని వికసింపచేయాలి. అందుకు జపం, ప్రార్థనలవంటి సాధనలు ఆవశ్యకం. ఈ ఆధ్యాత్మిక కేంద్రాన్ని కనుగొనే వరకు ధ్యానసమయంలో అతడి మనస్సు చంచలమౌతూనే ఉంటుంది. అతడి పరంగా ధ్యానం కేవలం మనస్సుతో జరిపే పోరాటం మాత్రమే అని శ్రీ భజనానంద స్వామి ఉద్ఘాటిస్తున్నారు.

ఈ హృదయం లోపల ఉన్నది ఒక ఆకాశం -

**సంతతగ్ం శిలాభిస్తు లంబత్యాకోశసన్నిభమ్ ।**

**తస్యాంతే సుషిరగ్ం సూక్ష్మం తస్మిన్ సర్వం ప్రతిష్ఠితమ్ ॥8**

ఆకోశసన్నిభమ్ = తామర మొగ్గవంటి హృదయం; సంతతం = నలువైపుల; శిలాభి = నాడులతో; లంబతి = వ్రేలాడుచున్నది; తస్య = దాని; అంతే = లోపల; సూక్ష్మం = సూక్ష్మమైన; సుషిరం = ఆకాశం; సర్వం = అంతా; తస్మిన్ = దాన్లో; ప్రతిష్ఠితమ్ = నెలకొనిఉంది.

**తా॥** *తామర మొగ్గవంటి హృదయం నలువంకల నాడులతో ఆవృతమై వ్రేలాడుచున్నది. దాని లోపల సూక్ష్మాకాశం ఉన్నది. అంతా దాన్లో నెలకొని ఉంది.*

ఛాందోగ్యోపనిషత్తు (8. 1. 1) దాన్ని చక్కగా వివరిస్తున్నది! "ఈ శరీరంలో చిన్న భవనం ఉన్నది. దాన్లో అంతరాకాశం ఉంది. అందులో ఉన్నదాన్ని అన్వేషించాలి."

"(బాహ్యంగా కానవచ్చే) ఆకాశం ఎంత విస్తృతమైనదో హృదయం లోపల ఉన్న ఆకాశమూ అంతే విస్తృతమైనది. దేవలోకం, భూలోకం యీ పరిధిలోకి వస్తాయి. అగ్ని, వాయువు, చంద్రుడు, మెరుపు, నక్షత్రాలే కాక యీ విశ్వంలో ఏమేమి ఉన్నాయో, ఏమేమి లేవో, అవన్నీ ఇందులో ఉన్నాయి" అని యీ ఆకాశం గురించి ఛాందోగ్యోపనిషత్తు (8. 1. 1)తెలియచేస్తున్నది.

ఆకాశంలో ప్రాణం నెలకొని ఉంది -

**తస్య మధ్యే మహానగ్నిర్విశ్వార్చిర్విశ్వతోముఖః ।**

**సోఽగ్రభుగ్విభజంతిష్ఠన్నాహార మజరః కవిః ॥ 9**

తస్య = దాని; మధ్యే = మధ్యలో; విశ్వార్చిః = సర్వత్రా ప్రకాశ కిస్తూ; విశ్వతోముఖః = అన్ని దిశలా వ్యాపిస్తూన్నట్లూ; మహాన్ = మహోన్నతమైన; అగ్ని = అగ్ని; సః = ఆ అగ్ని; అగ్రభుక్ = మొట్టమొదట భుజించే; ఆహారమ్ = ఆహారాన్ని; విభజన్ = విభజించి యిచ్చునట్లు; తిష్ఠన్ = దృఢమైనదిగా; అజర = పాతపడనిదిగా; కవిః = అన్నిటిని చూసేదిగా.

**తా॥** *సర్వత్రా ప్రకాశిస్తూ, అన్ని దిశలా వ్యాపిస్తూన్న మహోన్నత మైన అగ్ని ఆ ఆకాశానికి నడుమన ఉంది. ప్రాణం అయిన ఆ అగ్ని మొట్టమొదట భుజించేదిగాను, ఆహారాన్ని విభజించి ఇచ్చేదిగాను, దృఢమైనదిగాను, పాతపడనిదిగాను, అన్నింటిని చూసేదిగాను ఉన్నది.*

క్రమక్రమంగా మనలను అంతర్ముఖం చేసే ప్రయత్నంలో తరువాతిమెట్టు ఇది. ఆకాశంలో అగ్ని. ఇదే ప్రాణం. ఇదే మనలో ఉంటున్న చలనశక్తి. ఆహారాన్ని విభజించి, ఆహారం నుండి గ్రహించిన శక్తిని అన్నిచోట్లకు తీసుకువెళ్లడం, తరగును విసర్జించడం యిత్యాది శరీర పోషణార్ధకమైన క్రియలు ప్రాణమే చేస్తుంది. హృదయాకాశం మధ్యన యీ ప్రాణం నెలకొని ఉంది. శరీరంలోని అన్ని భాగాలకు వ్యాపించి ఉన్నందున అన్నిటిని చూస్తూవున్నట్లుగా చెప్పబడింది.

ప్రాణం యొక్క జ్వాలగా జీవాత్మ ఉంటున్నది –

తిర్యగూర్ధ్వమధశ్శాయీ రశ్మయస్తస్య సంతతా।
సంతాపయతి స్వం దేహమాపాదతలమస్తకః ।
తస్య మధ్యే వహ్నిశిఖా అణీయోర్ధ్వా వ్యవస్థితః ॥ 10

తస్య = ఆ ప్రాణం యొక్క; రస్మయః = కిరణాలు; తిర్యక్ = అడ్డదిడ్డంగాను; ఊర్ధ్వం = ఊర్ధ్వంగాను; అధః = అధోముఖంగాను; శాయీ = వ్యాపించి; సంతతా = ఎల్లప్పుడు వ్యాపించి ఉన్నాయి; ఆపాదతలమస్తకః = పాదం నుండి తలవరకు; స్వం దేహం = తన శరీరాన్ని; సంతాపయతి = వెచ్చగా ఉండేట్లు చేస్తుంది; తస్య = దాని; మధ్యే = నడుమ; అణీయః = అణు ప్రమాణమైన; వహ్నిశిఖా = అగ్నిజ్వాల; ఊర్ధ్వా = ఊర్ధ్వముఖంగా; వ్యవస్థితః = అమరి ఉంది.

**తా॥** *ఆ ప్రాణం యొక్క కిరణాలు అడ్డదిడ్డంగా, ఊర్ధ్వంగా అధోముఖంగా ప్రసరిస్తూ సర్వత్రా వ్యాపించి ఉన్నాయి. పాదం నుండి తల వరకు తన శరీరాన్ని వెచ్చగా ఉండేట్లు చేస్తుంది. దీని మధ్య అణు ప్రమాణమైన అగ్నిజ్వాల ఊర్ధ్వముఖంగా అమరి ఉంది.*

ఈ ప్రాణం శరీరాన్ని వీడిపోవడమే ప్రాణం పోవడం లేక మరణం అని పేర్కోబడుచున్నది. శరీరంలో వెచ్చదనం తగ్గి అది చల్లబడడం చూసి ఆ సదరు వ్యక్తి చనిపోయాడని రూఢిపరచడం తెలిసిన సంగతే. శరీరానికి వెచ్చదనం కల్పించేది ఈ ప్రాణమే. ఆ అగ్నికి నడిమి భాగాన దాని శిఖ ఊర్ధ్వముఖమై ప్రకాశిస్తుంది. ఈ అగ్నిశిఖయే జీవాత్మ.

నీలతోయదమధ్యస్థాద్విద్యుల్లేఖేవ భాస్వరా ।
నీవార శూకవత్తన్వీ పీతా భాస్వత్యణూపమా ॥ 11

నీలతోయదమధ్యస్థాత్ = నీలమేఘం మధ్యనుండి; భాస్వరా = ప్రకాశించే; విద్యుత్ లేఖాయివ = మెరపు తీగవలె; నీవారశూకవత్ = వరి మొలకలా; తన్వీ = సన్నమైనదిగా; పీతా = బంగారు రంగుగా; అణు ఉపమా = అణువులా సూక్ష్మమైనదిగా; భాస్వతి = ప్రకాశిస్తూ ఉంది.

**తా॥** *కారుమేఘం మధ్యనుండి వెలుగును విరజిమ్మే మెరపు తీగలా, వరి మొలకలా సన్ననైనదిగా, బంగారు ఛాయగాను, అణువులా సూక్ష్మమైనదిగాను ఆ ఆత్మ ప్రకాశిస్తూ ఉంటుంది.*

జీవాత్మ సూక్ష్మమైనది. అది సూక్ష్మమైనది స్వప్రకాశమానమైనది అంటూ అనేక ఉపనిషత్తులు పలు రకాలుగా చెబుతున్నాయి. వందలాది పోగులుగా విడివడిన ముడిలోని ఒక భాగం పరిమాణం గలది జీవాత్మ అని శ్వేతాశ్వతరోపనిషత్తు (5.9) పేర్కొంటున్నది. జీవాత్మ అణుమాత్రమైన దని ముండక ఉపనిషత్తు (3.1.9) తెలుపుతున్నది. సూక్ష్మమైనది అంటేనే ఇంద్రియాలకు మనస్సుకు, వాక్కుకు అది అతీతమైనదనే కదా అర్థం! అలాటి ఒక దానిని వివరించే ఋషుల ప్రయత్నాలే ఇవన్నీ!

జీవాత్మలో భగవంతుడు విరాజిల్లుచున్నాడు –

**తస్యాః శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః । స బ్రహ్మ స శివః స హరిః సేంద్రః సోఽక్షరః పరమః స్వరాట్ ॥ 12**

తస్యాః = ఆ; శిఖాయా = జ్వాల యొక్క; మధ్యే = మధ్యలో; పరమాత్మ = పరమాత్మ; వ్యవస్థితః = నెలకొని ఉన్నాడు; సః = ఆయనే;

బ్రహ్మ = బ్రహ్మ; సః = ఆయనే; శివః = శివుడు సః = ఆయనే; హరిః = విష్ణువు; సః = ఆయనే; ఇంద్రః = ఇంద్రుడు; సః = ఆయనే; అక్షరః = అవినాశి; స్వరాట్ = స్వప్రకాశమానుడు; పరమః = ఆయన కంటే అధికుడు ఎవరూ లేనివాడు.

**తా॥** *ఆ అగ్నిశిఖ మధ్యన పరమాత్మ సుప్రతిష్ఠితుడై ఉన్నాడు. ఆయనే బ్రహ్మ, ఆయనే శివుడు, ఆయనే విష్ణువు,ఆయనే ఇంద్రుడు. ఆయన అవినాశి, స్వప్రకాశమానుడు. ఆయనకంటే అధికుడు ఎవరూ లేనివాడు.*

ఆ భగవంతుని కీర్తించాలి -

**ఋతగ్ం సత్యం పరం బ్రహ్మ పురుషం కృష్ణపింగలమ్ ।**
**ఊర్ధ్వరేతం విరూపాక్షం విశ్వరూపాయ వై నమో నమః ॥ 13**

ఋతం = కనబడే వస్తువులను అందంగాను; సత్యం = దృశ్యానికి ఆధారంగాను ఉన్న; పరంబ్రహ్మ = పరబ్రహ్మాన్ని; పురుషం = ప్రతి శరీరం అంతటా నిండినవాణ్ణి; కృష్ణపింగలమ్ = నల్లని మేని విష్ణువు తెల్లని మేని శివుడూ ఒకరుగా మిశ్రితమైన రూపాన్ని; ఊర్ధ్వరేతం = పరిపూర్ణ పవిత్రుడూ; విరూపాక్షం = త్రినేత్రుని; విశ్వరూపాయ వై = సమస్తాన్ని తన స్వరూపంగా గ్రహించినవాణ్ణి; నమోనమః = పదే పదే నమస్తరిస్తాను.

**తా॥** *కానవచ్చే వస్తుజాతాన్ని అందంగాను, దృశ్యానికి ఆధారం గాను ఉన్న భగవంతుని, ప్రతి శరీరం అంతటా నిండివున్నవాణ్ణి, నల్లని మేని విష్ణువు తెల్లని మేని శివుడు ఒకరుగా మిశ్రితమైన రూపాన్ని, పూర్ణ పవిత్రునీ, త్రినేత్రునీ, సమస్తాన్ని తన స్వరూపం పరిగ్రహించిన వాణ్ణి పదేపదే నమస్కరిస్తాను.*

ఈ విధంగా మనలను అంతర్ముఖం చేసి భగవంతుని సన్నిధానానికి చేరుస్తుంది యీ సూక్తం. ఆ పైన అవిచ్ఛిన్న ప్రేమతో ఆయన సాన్నిధ్యంలో గడపడమే నిజమైన ధ్యానం.

తరువాతిది విష్ణుగాయత్రీ. నారాయణ సూక్తమ్ పిదప దీనిని పారాయణ చేయడం పరిపాటి.

**ఓం నారాయణాయ విద్మహే వాసుదేవాయ ధీమహి ।**
**తన్నో విష్ణుః ప్రచోదయాత్ ॥**

**ఓం సహ నావవతు ।**

**ఓం శాంతిః శాంతిః శాంతిః ॥**

నారాయణాయ = నారాయణుని; విద్మహే = తెలుసుకొందాం; వాసుదేవాయ = వాసుదేవుని; ధీమహి = ధ్యానిద్దాం; తత్ విష్ణుః = ఆ విష్ణువు; నః = మనలను; ప్రచోదయాత్ = ప్రేరేపించుగాక!

నారాయణుని తెలుసుకొందాం. అందు నిమిత్తం ఆ వాసుదేవుని ధ్యానిద్దాం. ఆ విష్ణువు మనలను యీ ధ్యాన ప్రయత్నంలో ప్రేరేపించుగాక!



# శ్రీ సూక్తమ్

**ఓం హిరణ్యవర్ణాం హరిణీం సువర్ణరజతస్రజామ్ ।**

**చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మ ఆవహ ॥ 1**

జాతవేద: = అగ్నిదేవా; హిరణ్యవర్ణాం = సువర్ణకాంతి గలదీ; హరిణీం = పాపాలను హరించివేసేదీ; సువర్ణరజతస్రజాతమ్ = వెండి బంగారు హారాలను అలంకరించుకొన్నదీ; చంద్రాం = చంద్రుని పోలినదీ; హిరణ్మయీం = బంగారుమయమైనదీ; లక్ష్మీం = మహాలక్ష్మిని; మే = నా నిమిత్తం; ఆవహ = ఆవాహన గావించు (ఆహ్వానించు)!

**తా॥** *అగ్నిదేవా! సువర్ణకాంతి వంటి ఛాయగలదీ, పాపాలను హరించివేసేదీ, బంగారు వెండి హారాలను అలంకరించుకొన్నదీ, చంద్రుని వంటి ఆహ్లాదం కలదీ, సువర్ణమయమైనదీ అయిన మహాలక్ష్మిని నా కొరకు ఆవాహన చెయ్యి!*

**తాం మ ఆవహ జాతవేదో లక్ష్మీమనపగామినీమ్ ।**

**యస్యాం హిరణ్యం విందేయం గామశ్వం పురుషానహమ్ । 2**

జాతవేద: = అగ్నిదేవా; అహం = నేను; హిరణ్యం = బంగారాన్ని; కాం = గోవులను; అశ్వం = గుర్రాలను; పురుషాన్ = బంధువులను; విందేయం = ప్రాప్తించుకొంటానో; తాం = ఆ; లక్ష్మీం = మహాలక్ష్మిని, యస్యాం అనపగామినీమ్ = నానుండి వెళ్లిపోనటువంటి; మే = నా వద్దకు; ఆవహ = ఆవాహనచెయ్యి.

---

వేదాలలోను, పురాణాలలోను కానవచ్చే మహాలక్ష్మి స్తుతుల సంకల నమే శ్రీసూక్తమ్. దక్షిణదేశంలో ఇది బహుళ ప్రాచుర్యం సంతరించుకొన్న దవడం ముదావహం. శ్రీమహాలక్ష్మి కృపాకటాక్షం పరిపూర్ణంగా కలుగుతుందనే విశ్వాసంతో దీనిని పారాయణ చేయడం పరిపాటి.

**తా॥** *ఓ అగ్నిదేవా; ఎవరి కృపాకటాక్షంతో నాకు బంగారం గోవులు గుఱ్ఱాలు బంధువులు సంప్రాప్తమైనవో ఆ మహాలక్ష్మిని నా కడకు ఆవాహన చెయ్యి; ఆమె నా వద్దనుండి వీడిపోనట్లు చూడు!*

**అశ్వపూర్వాం రథమధ్యాం హస్తినాదప్రబోధినీమ్।**

**శ్రియం దేవీముపహ్వయే శ్రీర్మా దేవీర్జుషతామ్ ॥ 3**

అశ్వపూర్వాం = ముందు గుఱ్ఱాలూ; రథమధ్యాం = రథం నడుమన; హస్తినాదప్రబోధినీమ్ = ఏనుగు ఘీంకారం సంకేతంగా గలదీ; శ్రియం దేవీం = శ్రీదేవిని; ఉపహ్వయే = ఆహ్వానిస్తున్నాను; శ్రీ:దేవీ = శ్రీదేవీ; మాజుషతాం = నా వద్ద సంతోషంగా నెలకొను.

**తా॥** *గుఱ్ఱాలను పూన్చిన రథం మధ్యన ఆసీనురాలైనదీ, తన రాకను ఏనుగు ఘీంకారనాదంతో సూచిస్తూవున్నదీ అయిన శ్రీదేవిని ఆహ్వానిస్తున్నాను. శ్రీదేవీ! నువ్వు నా వద్ద సంతోషంగా నెలకొని ఉండుగాక!*

**కాం సోస్మితాం హిరణ్యప్రాకారామార్ద్రాం జ్వలన్తీం తృప్తాం తర్పయన్తీమ్ । పద్మే స్థితాం పద్మవర్ణాం తామిహోపహ్వయే శ్రియమ్ ॥ 4**

స్మితాం = చిరుదరహాసంతో కూడినదీ; హిరణ్య ప్రాకారాం = బంగారు కోటలో వసించునదీ; ఆర్ద్రాం = కరుణాస్వరూపిణీ; జ్వలన్తీం = తేజస్సుతో కూడినదీ; తృప్తాం = ఆనందంతో నింపారునదీ; తర్పయన్తీమ్ = ఆనందాన్ని ప్రసాదించునదీ; పద్మే = పద్మంలో; స్థితాం = ఆసీనురాలైనదీ; పద్మవర్ణాం = పద్మం వంటి రంగు కలదీ; కాం = ఎవరో; తాం శ్రియమ్ = ఆ శ్రీదేవిని; ఇహ = ఇక్కడ; ఉపహ్వయే = ప్రార్థిస్తున్నాను.

**తా॥** చిరుదరహాసంతో కూడినదీ, బంగారు కోటలో వసించునదీ, కరుణాస్వరూపిణీ, తేజస్స్వరూపిణీ, ఆనందస్వరూపిణీ, ఆనందం ప్రసాదించునదీ, పద్మంలో ఆసీనురాలైనదీ, పద్మంవంటి ఛాయగలదీ అయిన ఆ శ్రీదేవిని ఇక్కడ సాక్షాత్కరింపమని ప్రార్థిస్తున్నాను.

**చంద్రాం ప్రభాసాం యశసా జ్వలంతీం శ్రియం లోకే దేవజుష్టాముదారామ్ । తాం పద్మినీమీం శరణమహం ప్రపద్యేఽలక్ష్మీర్మే నశ్యతాం త్వాం వృణే ॥ 5**

లోకే = లోకులకు; చంద్రాం = చంద్రుని వంటిదిగాను; ప్రభాసాం = సముజ్వలమైనదీ; యశసా = కీర్తివల్ల; జ్వలంతీం = దేదీవ్యమానంగా ప్రకాశిస్తూన్నదీ; దేవజుష్టాం = దేవతలచే పూజలు అందుకొనునదీ; ఉదారామ్ = కరుణాస్వరూపిణీ; పద్మినీం = పద్మాన్ని ధరించినదీ; ఈం = ఈం అనే బీజ మంత్రానికి భావంగా విరాజిల్లునదీ; తాం శ్రియం = ఆ మహాలక్ష్మిని; అహం = నేను; శరణం ప్రపద్యే = శరణజొచ్చుతాను; త్వాం = నిన్ను; వృణే = అర్థిస్తున్నాను; మే = నా నుండి; అలక్ష్మీః = దారిద్ర్యం; నశ్యతాం = నశించనీ.

**తా॥** చంద్రుని పోలినదీ, తేజోవంతమైనదీ, తన కీర్తిచంద్రికల వలన దేదీవ్యమానంగా ప్రకాశిస్తూన్నదీ, దేవతలచే పూజలు అందుకొనునదీ, కరుణాస్వరూపిణీ, పద్మాన్ని ధరించినదీ, 'ఈం' అనే బీజమంత్రానికి భావంగా విరాజిల్లుతూన్నదీ అయిన మహాలక్ష్మిని నేను శరణుజొచ్చుతాను. ఓ దేవీ! నిన్ను ప్రార్థిస్తున్నాను, నా దారిద్ర్యం తీరిపోయేలా కరుణించు.

**ఆదిత్యవర్ణే తపసోఽధిజాతో వనస్పతిస్తవ వృక్షోఽథబిల్వః తస్య ఫలాని తపసా నుదన్తు మాయాంతరాయాశ్చ బాహ్యా అలక్ష్మీః॥ 6**

ఆదిత్యవర్ణే = సూర్యుని వన్నె కలదీ; తవ = నీ; తపస = తపస్సు వల్ల; వనస్పతి = వనానికి అధిపతియైన; బిల్వః వృక్షః = బిల్వవృక్షం; అధిజాతః = ఉద్భవించింది; అత = అట్లే; తపసా = తపస్సువల్ల; తస్య = దాని; ఫలాని = ఫలాలు; మాయా = అజ్ఞానాన్ని; అంతరాయాః = అంతరాయాలను; అలక్ష్మీ = అమంగళమైన; బాహ్యా = బాహ్యమైన ఆటంకాన్నీ; నుదన్తు= తొలగించుగాక.

**తా॥** *సూర్యుని వన్నె కలదానా! వనానికి అధిపతియైన బిల్వవృక్షం నీ తపోమహిమచే ఉద్భవించింది. నీ తపస్సంభూతాలైన దాని ఫలాలు అజ్ఞానమైన లోపలి ఆటంకాన్నీ, అమంగళకరమైన బాహ్య ఆటంకాన్నీ తొలగిస్తాయి గాక!*

**ఉపైతు మాం దేవసఖః కీర్తిశ్చ మణినా సహ ।**
**ప్రాదుర్భూతోఽస్మి రాష్ట్రేఽస్మిన్ కీర్తిమృద్ధిం దదాతు మే ॥ 7**

దేవసఖః = కుబేరుడూ; కీర్తిః చ = కీర్తిదేవుడూ; మణినా సహ = ఐశ్వర్యాలతో; ఉపైతు = వెన్నంటి రావాలి; అస్మిన్ = ఈ; రాష్ట్రే = దేశంలో; ప్రాదుర్భూతః అస్మి = జన్మించివున్నాను; మే = నాకు; కీర్తిం = కీర్తిని; రిద్ధిం = ఐశ్వర్యాన్ని; దదాతు = ప్రసాదించు.

**తా॥** కుబేరుడూ, కీర్తిదేవుడూ ఐశ్వర్యాలతో నన్ను వెన్నంటి

*రావాలి. నీ అనుగ్రహం పూర్తిగా సంతరించుకొన్న యీ దేశంలో నేను జన్మించాను. కీర్తిని, ఐశ్వర్యాన్ని నాకు ప్రసాదించు!*

**క్షుత్పిపాసామలాం జ్యేష్ఠామలక్ష్మీం నాశయామ్యహమ్।**
**అభూతిమసమృద్ధిం చ సర్వాం నిర్ణుద మే గృహాత్ ॥8**

క్షుత్పిపాసామలాం = ఆకలి దప్పికలచే కృశించినదీ; జ్యేష్ఠాం = ముందు జన్మించినదీ; అలక్ష్మీం = అలక్ష్మిని; అహం = నేను; నాశయామి = నాదరి చేరకుండుగాక; మే గృహాత్ = నా గృహం నుండి; సర్వాం = సమస్త; అభూతిం = అభాగ్యాన్ని; అసంరుద్ధిం చ = అసమృద్ధులను; నిర్ణుద = నిర్మూలించి అనుగ్రహించు.

**తా॥** *ఆకలి దప్పికలతో కృశించినదీ, శ్రీదేవికంటే ముందుగా జన్మించినదీ అయిన జ్యేష్ఠాదేవిని (అలక్ష్మిని) నాదరి చేరకుండుగాక. నా గృహం నుండి అభాగ్య, అసమృద్ధులను పూర్ణంగా నిర్మూలించి అనుగ్రహించు.*

**గంధద్వారాం దురాధర్షాం నిత్యపుష్టాం కరీషిణీమ్ ॥**
**ఈశ్వరీగ్ం సర్వభూతానాం తామిహోపహ్వయే శ్రియమ్ ॥ 9**

గంధద్వారాం = సుగంధానికి ఆలవాలమైనదీ; దురాదర్షాం = జయింపనలవికానిదీ; నిత్యపుష్టాం = సర్వదా పుష్టినిచ్చునదీ; కరీషిణీం = సకలమూ పరిపూర్ణంగా కలదీ; సర్వభూతానాం = సకల జీవుల; ఈశ్వరీం = నాయకురాలైనదీ; తాంశ్రియమ్ = ఆ మహాలక్ష్మిని; ఇహ = ఇక్కడ; ఉపహ్వాయే = అనుగ్రహింప ప్రార్థిస్తున్నాను.

**తా॥** సుగంధానికి ఆలవాలమైనదీ, జయింప నలవికానిదీ, సతతం పౌష్టికత నిచ్చునదీ, సకల సంపన్నురాలూ, సమస్త జీవులకు నాయకురాలైనదీ అయిన మహాలక్ష్మిని యిక్కడ ఆవాహన చేస్తున్నాను.

**మనసః కామమాకూతిం వాచః సత్యమశీమహి ।**

**పశూనాం రూపమన్నస్య మయి శ్రీః శ్రయతాం యశః ॥10**

శ్రీః = శ్రీదేవీ; మనసః = మనస్సులో కలిగే; కామం = ఇచ్ఛలను; ఆకూతిం = సంతోషాన్ని; వాచః = వాక్కులో; సత్యం = సత్యాన్ని; పశూనాం = గోవుల ద్వారా; అన్నస్య = ఆహారం ద్వారా; మయి = నాకు; యశః = కీర్తి: శ్రయతాం = కలుగుగాక.

**తా॥** *శ్రీదేవీ! మనస్సులో జనించే ఉదాత్త ఆకాంక్షలను, సంతోషాన్ని, వాక్కులో సత్యాన్ని, గోసమృద్ధి చేత, ఆహార సమృద్ధి చేత కలిగే ఆనందాన్ని నేను చవిచూడాలి. నాకు కీర్తి కలుగుగాక!*

**కర్దమేన ప్రజాభూతా మయి సంభవ కర్దమ ।**

**శ్రియం వాసయ మే కులే మాతరం పద్మమాలినీమ్ ॥ 11**

కర్దమ = కర్దమ మహర్షీ : కర్దమేన = కర్దముడవైన నీకు; ప్రజాభూతా = పుత్రికగా జన్మించిన మహాలక్ష్మి; మయి = నాకు; సంభవ = సాక్షాత్కరించనీ; పద్మమాలినీమ్ = తామర పువ్వుల మాల ధరించినదీ; శ్రియం = సిరసంపదలకు అధిదేవతగాను; మాతరం = మాతగాను; మే = నా; కులే = కులంలో; వాసయ = వసించునట్లు చేయాలి.

**తా॥** *కర్దమ మహర్షీ! నీకు పుత్రికగా జన్మించిన మహాలక్ష్మి నాకు సాక్షాత్కరించాలి. తామరపువ్వుల మాల దాల్చినదీ, సిరిసంపదలకు అధి దేవతా, తల్లీ అయిన ఆమెను నా కులంలో*

*సతతం వసింప చేయాలి.*

**ఆపః సృజంతు స్నిగ్ధాని చిక్లీత వస మే గృహే ।**

**ని చ దేవీం మాతరం శ్రియం వాసయ మే కులే ।12**

చిక్లీత = చిక్లీతా; ఆపః = నీరు; స్నిగ్ధాని = మంచి ఆహారపదార్థాలను; సృజంతు = ఉత్పన్నం చేయనీ; మే = నా; గృహే = గృహంలో; వస = వసించాలి; చ = ఇంకా; దేవీ = దేవీ; మాతరం = మాతమైన; శ్రియం = శ్రీదేవిని; మే = నా; కులే = కులంలో; నివాసయ = వసించేలా అనుగ్రహించు.

**తా॥** *శ్రీదేవి పుత్రుడవైన ఓ చిక్లీతా ! నీరు చక్కని ఆహారపదార్థాలను ఉత్పాదన చేయుగాక! నా ఇంట నువ్వు వసించాలి. దేవీ, నీ మాతా అయిన శ్రీదేవి నా కులంలో నిరంతరం వసింప అనుగ్రహించు!*

**ఆర్ద్రాం పుష్కరిణీం పుష్టిం పింగలాం పద్మమాలినీమ్ ।**

**చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మ ఆవహ ॥13**

జాతవేదః = అగ్నిదేవుడా; ఆర్ద్రాం = కరుణాపూరిత మనస్సుగలదీ; పుష్కరిణీం = పద్మవాసినీ; పుష్టిం = ఆహారం ఒసగి పోషిస్తున్నదీ; పింగలాం = కుంకుమ వన్నె గలదీ; పద్మమాలినీమ్ = తామరపువ్వుల మాల ధరించినదీ; చంద్రాం = చంద్రుని పోలినదీ; హిరణ్మయీం = బంగారుమయమైనదీ; లక్ష్మీం = మహాలక్ష్మిని; మే = నాకై; ఆవహ = ఆవాహనచేయి.

**తా॥** *అగ్నిదేవా! కరుణాపూరిత మనస్సుగలదీ, పద్మవాసినీ, ఆహారం ఒసగి లోకాన్ని పోషించేదీ, కుంకుమ వన్నె గలదీ, తామర*

పువ్వుల మాలాధారీ, చంద్రునిలా ఆహ్లాదకారిణీ, బంగారుమయమైనదీ అయిన మహాలక్ష్మిని నా నిమిత్తం ఆవాహనచేయి.

**ఆర్ద్రాం యః కరిణీం యష్టిం సువర్ణాం హేమమాలినీమ్।**

**సూర్యాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మ ఆవహ ।14**

జాతవేదః = అగ్నిదేవుడా; యః = ఎవరు; ఆర్ద్రాం = దయార్ద్ర హృదయురాలూ; కరిణీం = గంభీరమూర్తీ; యష్టిం = దండం చేతబట్టినదీ; సువర్ణాం = అందమైన దేహచ్ఛాయ గలదీ; హేమమాలినీమ్ = బంగారు హారాలు ధరించినదీ; సూర్యాం = సూర్యునిలా ప్రకాశమానమైనదీ; హిరణ్మయీం = బంగారుమయమైనదీ; లక్ష్మీం = మహాలక్ష్మిని; మే = నాకోసం; ఆవహ = ఆవాహన చెయ్యి.

**తా॥** *అగ్నిదేవా! దయార్ద్రహృదయురాలూ, గంభీరమూర్తీ, దండం చేతబట్టినదీ, అందమైన మేనిచ్ఛాయగలదీ, సూర్యునిలా ప్రకాశమానమైనదీ, బంగారుమయమైనదీ అయిన మహాలక్ష్మిని నాకోసం ఆవాహన గావించు.*

**తాం మ ఆవహ జాతవేదో లక్ష్మీమనపగామినీమ్।**

**యస్యాం హిరణ్యం ప్రభూతం గావో దాస్యోఽశ్వాన్, విందేయం పురుషానహమ్ ॥15**

జాతవేదాః = అగ్నిదేవా; యస్యాం = ఎవరి వలన; ప్రభూతం = లెక్కకు మిక్కిలి; హిరణ్యం = బంగారం; గావః = గోవులూ; దాస్యః = సేవకురాండ్రూ; అశ్వాన్ = గుర్రాలూ; పురుషాన్ = సేవకులూ; అహం = నేను; విందేయం = పొందుతానో; తాం = ఆ; లక్ష్మీం = లక్ష్మీదేవిని;

మే అనపగామినీమ్ = నన్ను విడిచి వెళ్లిపోకుండా; ఆవహ = కృపచూపాలి.

**తా॥** *అగ్నిదేవా! ఎవరి వలన నేను అపరిమిత బంగారం, గోవులు, సేవకురాండ్రు, గుర్రాలు, సేవకులను ప్రాప్తించుకొంటానో అట్టి మహాలక్ష్మి నన్ను వదలి వెళ్లిపోకుండా కృపచూపు.*

**యః శుచిః ప్రయతో భూత్వా జుహుయాదాజ్యమన్వహమ్।**

**శ్రియః పంచదశర్చం చ శ్రీకామః సతతం జపేత్ ॥ 16**

యః = ఎవరు; శ్రీకామః = లక్ష్మీదేవి కటాక్షానికై ప్రార్థిస్తున్నాడో; శుచిః = శుచిగా; ప్రయతః = ఇంద్రియాలను నిగ్రహించినవానిగా; భూత్వా = ఉంటూ; అన్వహమ్ = అనునిత్య; ఆజ్యం = నేతితో; జుహుయాత్ = హోమం గావించాలి; చ = ఇంకా; శ్రియః = లక్ష్మీదేవి యొక్క; పంచదశర్చం = పదిహేను మంత్రాలను; సతతం = సదా; జపేత్ = జపిస్తూ ఉండాలి.

**తా॥** *ఎవరు లక్ష్మీదేవి కృపాకటాక్షార్థం ప్రార్థిస్తున్నారో వారు శుచిగా, ఇంద్రియాలు నిగ్రహించిన వారుగా ఉంటూ ప్రతిరోజు నేతితో హోమం చేయాలి. పైన తెలిపిన లక్ష్మీదేవి .యొక్క పదిహేను మంత్రాలను సదాజపిస్తూ ఉండాలి.*

**ఆనన్దః కర్దమశ్చైవ చిక్లీత ఇతి విశ్రుతాః ।**

**ఋషయస్తే త్రయః ప్రోక్తాస్స్వయం శ్రీరేవ దేవతా ॥ 17**

విశ్రుతాః = సుప్రసిద్ధులూ; ఋషయః = ఋషులూ; ఆనన్దః = ఆనందుడు; కర్దమ = కర్దముడు; శ ఏవ = ఇంకా; చిక్లీత = చిక్లీతుడూ; తే త్రయః = ఈ ముగ్గురూ; ప్రోక్తా = ఋషులు; స్వయం శ్రీః ఏవ = మహాలక్ష్మియే; దేవతా = దేవత.

**తా॥** సుప్రసిద్ధులూ, ఋషులూ అయిన ఆనందుడు, కర్దముడు, చిక్లీతుడు ముగ్గురూ యి సూక్తంలోని ఋషులు. మహాలక్ష్మియే దేవత.

**పద్మాననే పద్మ ఊరూ పద్మాక్షీ పద్మసంభవే ।**
**త్వం మాం భజస్వ పద్మాక్షీ యేన సౌఖ్యం లభామ్యహమ్ ॥ 18**

పద్మాననే = పద్మముఖీ; పద్మ ఊరూ = పద్మంవంటి ఊరువులు కలదానా; పద్మాక్షీ = పద్మంవంటి కన్నులు కలదానా; పద్మసంభవే = పద్మం నుండి ఉద్భవించినదానా; అహం = నేను; యేన = దేనివలన; సౌఖ్యం = సుఖం; లభామ్య = పొందుతానో; మామ్ = నాకు; త్వం = నువ్వు; భజస్వ = ప్రసాదించు.

**తా॥** పద్మం వంటి ముఖమూ, పద్మంవంటి ఊరువులూ, పద్మంవంటి కన్నులూ కలదానా, పద్మం నుండి ఉద్భవించినదానా, నేను దేని వలన సుఖిస్తానో దాన్ని నువ్వు నాకు అనుగ్రహించు.

**అశ్వదాయీ గోదాయీ ధనదాయీ మహాధనే ।**
**ధనం మే జుషతాం దేవిసర్వకామాంశ్చ దేహి మే ॥ 19**

అశ్వదాయీ = గుర్రాలను ఇచ్చునదీ; గోదాయీ = గోవులను ఇచ్చు నదీ; ధనదాయీ = సంపదను ఇచ్చునదీ; మహాధనే = ధనానికి అధిదేవతా; దేవి = మహాలక్ష్మీ; మే = నాకు; సర్వకామన్ = ఆకాంక్షలన్నీ; జుషతాం = సుఖాన్ని ఇచ్చే; ధనం = ధనాన్ని; మే = నాకు; దేహి = ప్రసాదించు.

**తా॥** గుర్రాలను సమర్పించేదీ, గోవులను సమర్పించేదీ, సంపదలను సమర్పించేదీ, ధనానికి అధిదేవతాయైన మహాలక్ష్మీ!

అభీష్టాలన్నీ నెరవేరేటప్పుడు కలిగే సుఖాన్ని ఇచ్చే సంపదను నాకు ప్రసాదించు.

**పుత్రపౌత్ర ధనం ధాన్యం హస్త్యశ్వాదిగవే రథమ్ ।**

**ప్రజానాం భవసి మాతా ఆయుష్మంతం కరోతు మామ్ ॥ 20**

పుత్ర = పుత్రలు; పౌత్ర = పౌత్రులు; ధనం = ధనము; ధాన్యం = ధాన్యము; హస్తి = ఏనుగు; అశ్వః ఆది = అశ్వం ఆదిగాగల; గవే = గోవుల; రథం = రథాలు; ప్రజానాం = ప్రజలకు; మాతా = మాతగా; భవసి = ఉంటూన్నావు; మామ్ = నన్ను; ఆయుష్మంతం = ఆయుష్మంతునిగా; కరోతు = గావించాలి.

**తా॥** *పుత్రులు, గోవులు, ధనధాన్యాలు, ఏనుగులు గుర్రాలు ఇత్యాదులు, గోవులు, రథాలు సకలం ప్రసాదించు. జనులకు నువ్వు తల్లిగా భాసిస్తున్నావు. నన్ను ఆయుష్మంతునిగా ఒనరించాలి.*

**ధనమగ్నిర్ధనం వాయుర్ధనం సూర్యో ధనం వసుః ।**

**ధనమింద్రో బృహస్పతిర్వరుణం ధనమశ్నుతే ॥ 21**

అగ్నిః = అగ్నిదేవుడూ; వాయుః వాయుదేవుడూ; సూర్యః = సూర్య భగవానుడూ; వసుః = వసువులూ; ఇంద్రః = దేవేంద్రుడూ; బృహస్పతిః = బృహస్పతీ; వరుణం = వరుణదేవుడూ; ధనం = ధనాన్ని; అశ్నుతే = అనుభవిస్తున్నారు.

**తా॥** *అగ్నిదేవుడూ, వాయుదేవుడూ, సూర్యభగవానుడూ, అష్టవసువులూ, దేవేంద్రుడూ, దేవగురువైన బృహస్పతీ, వరుణదేవుడూ తమ తమ సంపదలను నీ కృపతో అనుభవిస్తున్నారు.*

**చంద్రాభాం లక్ష్మీ మీశానాం సూర్యాభాం శ్రియమీశ్వరీమ్।**

**చంద్రసూర్యాగ్ని వర్ణాభాం శ్రీమహాలక్ష్మీముపాస్మహే ॥22**

చంద్రాభాం = చంద్రునిలా ఆహ్లాదంగా ప్రకాశిస్తూన్నదీ; ఈశానాం = దేవతల; లక్ష్మీం = శక్తిగా విరాజిల్లుతూన్నదీ; సూర్యాభాం = సూర్యునిలా తేజోవిరాజమానమైనదీ; శ్రియం = శ్రీదేవీ; ఈశ్వరీం = ఈశ్వరిగా, చంద్రసూర్య అగ్నిః = చంద్రుడు సూర్యుడు అగ్నియైన ముగ్గురినీ; వర్ణాభాం = మహిమగా కలదీయైన; శ్రీమహాలక్ష్మీం = శ్రీమహాలక్ష్మిని; ఉపాస్మహే = ఆరాధిస్తాము.

**తా॥** చంద్రునిలా ఆహ్లాదంగా ప్రకాశిస్తూన్నదీ, దేవతల శక్తిగా విరాజిల్లుతూన్నదీ, సూర్యునిలా తేజస్సుతో ప్రకాశిస్తూన్నదీ, శ్రీదేవీ, ఈశ్వరీ, చంద్ర సూర్య అగ్నుల ముగ్గురినీ తన మహత్తుగా కలదీయైన శ్రీమహాలక్ష్మిని ఆరాధిస్తాము.

**వైనతేయ సోమం పిబ సోమం పిబతు వృత్రహా ।**

**సోమం ధనస్య సోమినో మహ్యం దదాతు సోమినః ॥23**

వైనతేయ = గరుత్మంతుడూ; సోమం = సోమరసాన్ని; పిబ = గ్రోలు; వృత్రహా = వృత్రాసురుని సంహరించిన ఇంద్రుడు; సోమం = సోమరసాన్ని; పిబతు = గ్రోలనీ; సోమినః = సోమయాగం నిర్వర్తింప అశించే; మహ్యం = నాకు; ధనస్య సోమం = విరివిగా ధనాన్ని; దదాతు = ప్రసాదించనీ.

**తా॥** *ఓ గరుత్మంతుడా!* సోమరసం గ్రోలు. వృత్రాసురుని సంహరించిన ఇంద్రుడు సోమరసం గ్రోలనీ. సోమయాగం నిర్వర్తింప

ఆశిస్తూన్న నాకు పుష్కలంగా ధనాన్ని ప్రసాదించనీ,

**న క్రోధో న చ మాత్సర్యం న లోభో నాశుభామతిః ।**
**భవంతి కృతపుణ్యానాం భక్తానాం శ్రీసూక్తం జపేత్సదా ॥ 24**

కృత పుణ్యానాం = పుణ్యం చేసిన; భక్తానాం = భక్తులకు; క్రోధః = క్రోధం; న భవంతి = ఉండదు; న మాత్సర్యం = మాత్సర్యం ఉండదు; చ = ఇంకా; న లోభ = లోభం ఉండదు; న అశుభామతి = దుర్బుద్ధి పుట్టదు; శ్రీసూక్తం = శ్రీసూక్తాన్ని; సదా = ఎల్లవేళలా; జపేత్ = జపంచేయాలి.

**తా॥** *పుణ్యం చేసిన భక్తులకు కోపం రాదు, మాత్సర్యం ఉండదు, లోభం నశిస్తుంది, దుర్బుద్ధి పుట్టదు. భక్తిని పొంద వారు శ్రీసూక్తాన్ని సదా జపం చేయాలి.*

**వర్షంతు తే విభావరి దివో అభ్రస్య విద్యుతః ।**
**రోహంతు సర్వబీజాన్యవ బ్రహ్మ ద్విషో జహి ॥ 25**

విభావరి = రాత్రీ; దివో = పగలూ; తే = నీ కృపతో; అభ్రస్య విద్యుతః = విద్యుల్లతాయుక్తాలైన మేఘాలు; వర్షంతు = వర్షించనీ; సర్వబీజాని = అన్ని విత్తనాలూ; అపరోహంతు = చక్కగా మొలకెత్తనీ; బ్రహ్మ ద్విషః = భగవంతుని నిందించే వాడిని; జహి = నిష్క్రమింపచెయ్యి.

**తా॥** *నీ కృపతో విద్యుల్లతాయుక్తాలైన మేఘాలు రేయింబవళ్లు వర్షించనీ! విత్తనాలు సమస్తం చక్కగా మొలకెత్తి ఏపుగా పెరుగనీ! భగవంతుని నిందించేవారు నిష్క్రమించుగాక!*

పద్మప్రియే పద్మిని పద్మహస్తే పద్మాలయే పద్మదలాయతాక్షి
విశ్వప్రియే విష్ణు మనోఽనుకూలే త్వత్పాదపద్మం మయి
సన్నిధత్స్వ ॥ 26

పద్మప్రియే = పద్మాన్ని ఇష్టపడేదీ; పద్మిని = పద్మకుమారీ; పద్మహస్తే = పద్మాన్ని చేత ధరించినదీ; పద్మాలయే = పద్మనివాసినీ; పద్మదల ఆయత అక్షి = తామర రేకులవంటి విశాలమైన కన్నులు కలదానా; విశ్వప్రియే = లోకానికి ప్రియమైన దానా; విష్ణు మనః అనుకూలే = విష్ణువు మనస్సుకు అనుకూలురాలైనదానా; త్వత్ = నీ; పాదపద్మం = పాదపద్మాలను; మయి = నాపై; సన్నిధత్స్వ = నిలిపి కటాక్షించు.

**తా॥** *పద్మమంటే ఇష్టపడేదానా, పద్మకుమారీ, పద్మాన్ని చేత ధరించినదానా, పద్మ నివాసినీ, తామర రేకులవంటి విశాలమైన కన్నులు కలదానా, లోకానికి ప్రియమైనదానా, విష్ణువు మనస్సుకు అనుకూలురాలైనదానా, నీ పాదపద్మాలను నాపై మోపి నన్ను అనుగ్రహించు.*

యా సా పద్మాసనస్థా విపులకటితటీ పద్మపత్రాయతాక్షీ ।
గంభీరా వర్తనాభిః స్తనభర నమితా శుభ్ర వస్త్రోత్తరీయా ॥
లక్ష్మీర్దివ్యైర్గజేంద్రైమణిగణ ఖచితైస్స్నాపితా హేమకుంభైః
నిత్యం సా పద్మహస్తా మమ వసతు గృహేసర్వమాంగల్యయుక్తా
॥27

యా = ఎవరు; పద్మ ఆసనస్థా = పద్మం మీద ఆసీనురాలై ఉన్నదో; విపుల = విస్తారమైన; కటితటి = పిరుదులు కలదో; పద్మపత్ర ఆయత అక్షీ = తామర రేకులవంటి కన్నుల కలదో; గంభీర ఆవర్త నాభిః = లోతైన నాభిని కలిగివున్నదో; స్తనభార = స్తనాల భారంతో; నమితా = వంగి ఉన్నదో; శుభ్ర వస్త్ర ఉత్తరీయా = స్వచ్ఛమైన వలువలు, ఉత్తరీయం ధరించినదో; మణిగణ ఖచిత = రత్నాలు పొదిగిన; హేమకుంభైః = బంగారు కలశపు జలంతో; దివ్యైః = దేవలోకానికి చెందిన ; గజేంద్రైః = గజేంద్రులతో, స్నాపితా = అభిషేకింపబడేదీ; పద్మహస్తా = చేత పద్మం ధరించినదీ; సర్వమాంగల్యయుక్తా = సర్వమంగళ కరములు కలది; సా = అటువంటి; లక్ష్మీః = మహాలక్ష్మి; మమ = నా; గృహే = గృహంలో; నిత్యం = ఎల్లప్పుడూ; వసతు = నివసించుగాక.

**తా॥** *పద్మం మీద ఆసీనురాలై ఉన్నదెవరో, విస్తారమైన పిరుదులు గల వారెవరో, తామర రేకులవంటి నేత్రాలు గలవారెవరో, లోతైన నాభి గలవారెవరో, స్తనాల భారంతో వంగివున్న వారెవరో, స్వచ్ఛమైన వలువలు ఉత్తరీయం ధరించిన దెవరో, రత్నాలు పొదిగిన బంగారు కలశాల జలంతో దేవలోకంలోని శ్రేష్ఠతమ గజరాజులచే అభిషేకించబడుచున్న దెవరో, పద్మాన్ని చేత ధరించిన దెవరో, సర్వమంగళ స్వరూపిణియైన దెవరో అట్టి మహాలక్ష్మి నా గృహంలో సదాసర్వవేళలా నివసించుగాక!*

**లక్ష్మీం క్షీరసముద్ర రాజతనయాం శ్రీరంగధామేశ్వరీమ్।**

**దాసీభూతసమస్త దేవ వనితాం లోకైక దీపాంకురామ్ ।**

**శ్రీమన్మందకటాక్షలబ్ధ విభవ బ్రహ్మేంద్రగంగాధరాం । త్వాం**

**త్రైలోక్యకుటుంబినీం సరసిజాం వందే ముకుందప్రియామ్॥28**

లక్ష్మీం = భాగ్యానికి నెలవైనదీ; క్షీరసముద్రరాజతనయాం = క్షీర సముద్రరాజు తనయా; శ్రీరంగ ధామ ఈశ్వరీం = శ్రీరంగంలో నెలకొన్న దేవీ; దాసీభూత సమస్త దేవ వనితాం = దేవలోక స్త్రీల నందరినీ దాసీజనంగా చేసుకొన్నది ఎవరో; లోక ఏక దీప అంకురాం = లోకానికి ఏకైక దీపంగా (వెలుగుగా) ఉంటున్నదీ; శ్రీమన్మంద కటాక్షలబ్ధ విభావ బ్రహ్మ ఇంద్ర గంగాధరాం = ఎవరి మృదుల కటాక్షం పొందడంచే బ్రహ్మ ఇంద్రుడు గంగాధరుడు వైభవం సంతరించుకొన్నారో; త్రైలోక్య కుటుంబినీం = మూడు లోకాలను తన కుటుంబంగా కలదీ; సరసిజాం = తామర కొలనులో ఉద్భవించినదీ; ముకుంద ప్రియామ్ = మహావిష్ణువుకు ప్రియాతిప్రియమైనదీ; త్వాం = నిన్ను; వందే = నమస్కరిస్తున్నాను.

**తా॥** *భాగ్యానికి ఆలవాలమైన, క్షీరసముద్రరాజు తనయా, శ్రీరంగంలో వెలసినటువంటి, దేవలోక స్త్రీల నందరినీ దాసీజనంగా చేసుకొన్న, లోకానికి ఏకైక దీపంగా భాసిస్తూన్న, ఎవరి మృదుల కటాక్షంతో బ్రహ్మ ఇంద్రుడు గంగాధరుడు వైభవం సంతరించుకొన్నారో, మూడు లోకాలను తన కుటుంబంగా చేసుకొన్న, తామర కొలనులో ఉద్భవించినటు వంటి, మహావిష్ణువుకు ప్రియాతిప్రియమైన నీకు నమస్కారం చేస్తున్నాను.*

**సిద్ధలక్ష్మీర్మోక్షలక్ష్మీర్జయలక్ష్మీస్సరస్వతీ ।**
**శ్రీలక్ష్మీర్వర లక్ష్మీశ్చ ప్రసన్నా మమ సర్వదా ॥29**

సిద్ధలక్ష్మీః = సిద్ధలక్ష్మిగాను; మోక్షలక్ష్మీః = మోక్ష లక్ష్మిగాను; జయ లక్ష్మీః = జయలక్ష్మిగాను; సరస్వతీ = తామర కొలనులో

ఉద్భవించినదీ; శ్రీ లక్ష్మీః = శ్రీదేవిగాను; వరలక్ష్మీ = వరలక్ష్మిగాను; మమ = నాకు; సర్వదా = ఎల్లప్పుడూ; ప్రసన్నా = ప్రసన్నురాలవుగాక !

**తా॥** *తలచిన మాత్రాన నెరవేర్చే సిద్ధలక్ష్మిగాను, ముక్తిని అనుగ్రహించగల మోక్షలక్ష్మిగాను, విజయాన్ని సిద్ధింపచేసే జయలక్ష్మిగాను, పద్మకాసారంలో ఉద్భవించినటువంటి, సంపదలిచ్చే శ్రీదేవిగాను, వరాలు ప్రసాదించగల వరలక్ష్మిగాను విరాజిల్లుతూన్న నువ్వు సదాసర్వవేళలా నాకు ప్రసన్నురాలవుగా ఉండుగాక!*

**వరాంకుశౌ పాశమభీతిముద్రాం కరైర్వహంతీం కమలాస నస్థామ్ । బాలార్క కోటి ప్రతిభాం త్రిణేత్రాం భజేహమాద్యాం జగదీశ్వరీం త్వామ్ ॥30**

వర: అభీతి ముద్రాం = వర, అభయ ముద్రలు దాల్చినదానా; పాశం అంకుశౌ = పాశ, అంకుశాలను; కరైః = చేతులలో; వహన్తీం = దాల్చినదానా; కమలాసనస్థామ్ = కమలం మీద ఆసీనురాలైనటు వంటి; కోటి బాల అర్క ప్రతిభాం = కోటి బాలసూర్యుల ప్రకాశం కలదానా; త్రిణేత్రాం = మూడు కన్నులు గలదానా; ఆద్యాం = ఆదిశక్తీ; జగదీశ్వరీం = జగదీశ్వరీ; త్వామ్ = నిన్ను; అహం = నేను; భజే = స్తుతిస్తాను.

**తా॥** *వర అభయ ముద్రలు చేత దాల్చినదానా, పాశ అంకుశాలను చేత ధరించినదానా, పద్మనివాసినీ, కోటి బాల సూర్యుల ప్రకాశం కలదానా, మూడు కన్నులు కలదానా, ఆదిశక్తీ, జగదీశ్వరీ అయిన నిన్ను నేను స్తుతిస్తాను.*

**సర్వమంగలమాంగల్యే శివే సర్వార్థ సాధికే ।**

**శరణ్యే త్ర్యంబకే దేవి నారాయణి నమోఽస్తు తే ॥**

**నారాయణి నమోఽస్తు తే ।**

**నారాయణి నమోఽస్తు తే ॥ 31**

సర్వమంగల మాంగల్యే = మంగళాల (శుభాల) కల్లా మంగళకరమైన దానవు; శివే = మంగళాన్ని ప్రసాదించేదానవు; సర్వ అర్థ = సకల శుభాలను; సాధికే = సాధించి ఇచ్చేదానవు; శరణ్యే = శరణు పొందదగిన దానవు; త్ర్యంబకే = మూడు కన్నులు కలదానవు; దేవీ = దేవీ; నారాయణీ = నారాయణీ; తే = నీకు; నమః అస్తు = నమస్కరిస్తున్నాను.

**తా॥** *మంగళాలకల్లా మంగళకరమైన దానవు, మంగళం ప్రసాదించే దానవు, సకల శుభాలను సాధించి ఇచ్చేదానవు, శరణు పొందదానికి యుక్తమైన దానవు, మూడు కన్నులున్న దానవు అయిన దేవీ! నారాయణీ! నీకు నా నమస్కారము.*

**సరసిజనిలయే సరోజహస్తే ధవళతరాంశుక గంధమాల్య శోభే । భగవతి హరివల్లభే మనోజ్ఞే త్రిభువనభూతికరి ప్రసీద మహ్యమ్ ॥32**

సరసిజ నిలయే = పద్మనివాసినీ; సరోజహస్తే = చేతిలో పద్మం ధరించినదీ; ధవలతర అంశుక = పవిత్రమైన తెల్లవస్త్రాలు ధరించి; గంధమాల్య శోభే = సుగంధ మాలను ధరించి శోభించేదానా; భగవతీ =

భగవతీ; హరివల్లభే = హరి అర్ధాంగి; మనోజ్ఞే = కోర్కెల నెరిగి ఈడేర్చుదానా; త్రిభువన భూతికరి = ముల్లోకాలను పోషించి సంరక్షించేదానా; మహ్యమ్ = నాకు; ప్రసీద = అనుగ్రహించు.

**తా॥** పద్మవాసినీ, చేత పద్మాన్ని ధరించినదానా, పవిత్రమైన తెల్లని వస్త్రాలను సుగంధపూరిత మాలను ధరించి శోభించేదానా, భగవతీ, హరి అర్ధాంగీ, కోర్కెల నెరిగి యీడేర్చుదానా, ముల్లోకాలను పోషించి కాపాడేదానవైన నువ్వు నన్ను అనుగ్రహించు.

**ఓం విష్ణుపత్నీం క్షమాం దేవీం మాధవీం మాధవప్రియామ్।**
**విష్ణోః ప్రియసఖీం దేవీం నమామ్యచ్యుతవల్లభామ్॥ 33**

విష్ణుపత్నీం = విష్ణుపత్నీ; క్షమాం దేవీం = భూదేవిగా విరాజిల్లుతూన్న; మాధవీం = తులసి మొక్కగా రూపించినదీ; మాధవప్రియామ్ = మాధవునకు ప్రియమైన దానవుగా; విష్ణోః = విష్ణువు యొక్క; ప్రియసఖీం = ప్రియసఖివీ; అచ్యుత వల్లభామ్ = విష్ణువుతో కూడిన; దేవీం = దేవిని; నమామి = నమస్కరిస్తున్నాను.

**తా॥** విష్ణుపత్నీ భూదేవీ, తులసి మొక్కగా అలరారుతున్నదానా, మాధవుని ప్రియురాలూ, విష్ణువు ప్రియసఖీ, విష్ణువుతో కూడిన దేవీ నేను నమస్కరిస్తున్నాను.

**ఓం మహాలక్ష్మీ చ విద్మహే విష్ణుపత్నీ చ ధీమహి।**
**తన్నో లక్ష్మీః ప్రచోదయాత్ ॥ 34**

**తా॥** మహాలక్ష్మిని తెలుసుకొందాం. విష్ణుపత్నియైన ఆమెను అందుకై ధ్యానిద్దాం. ఆ లక్ష్మీదేవి మనలకు ప్రేరణ నిచ్చుగాక.

**శ్రీవర్చస్యమాయుష్యమారోగ్య మావిధాత్ పవమానం మహీయతే। ధనం ధాన్యం పశుం బహుపుత్రలాభం శతసంవత్సరం దీర్ఘమాయుః। ఋణ రోగాదిదారిద్ర్యపాప క్షుదపమృత్యవః। భయశోకమనస్తాపా నశ్యంతు మమ సర్వదా॥ 35**

శ్రీ = మహాలక్ష్మి; సర్వదా = ఎల్లప్పుడూ; మమ = నాకు; వర్చస్యం = వర్చస్సు; ఆయుష్యం = లోటులేని జీవితం; ఆరోగ్యం = మంచి ఆరోగ్యం; ఆవిధాత్ = ప్రసాదిస్తూ; పవమానం = వాయువు; మహీయత్ = వీచనీ; ధనం = ధనము; ధాన్యం = ధాన్యం; పశుం = పశుసంపద; బహుపుత్ర లాభం = పలువురు పుత్రులు; శతసంవత్సరం = నూరేళ్ళు; దీర్ఘమాయు = దీర్ఘాయుస్సు; ఋణః = అప్పు; రోగ ఆది = రోగం ఇత్యాదులు; దారిద్ర్యః = దరిద్రం; క్షుత్ = ఆకలి; అపమృత్యవః = అకాలమరణం వంటివి; భయం = భయం; శోకః = శోకం; మనః తాపా = మానసిక వ్యధలు; నశ్యంతు = నశించనీ.

**తా॥** *మహాలక్ష్మీ! వర్చస్సు, లోటులేని జీవితం, మంచి ఆరోగ్యం నాకు ప్రసాదించే పవనాలు సదాసర్వవేళలా వీచనీ. ధనధాన్యాలు, పశుసంపద, పుత్రులు, నూరేళ్ల దీర్ఘాయుస్సు నాకు చేకూరనీ. ఋణం, రోగం, దారిద్ర్యం, ఆకలి, అకాలమరణం, భయశోకాలు, మానసిక వ్యధలు ఇత్యాదులు నశించుగాక.*

**శ్రియే జాత శ్రియ ఆనిర్యాయ శ్రియం వయో జరితృభ్యో దధాతు । శ్రియం వసానా అమృతత్వమాయన్ భజంతి సద్యః సవితా విదధ్యూన్ ॥ 36**

శ్రియ ఆనిర్యాయ = శ్రీదేవి చేరేవారిని; శ్రియే జాత = ఐశ్వర్యం వరిస్తుంది; శ్రియం = సంపదా; వయః జరితృభ్యః = దీర్ఘ ఆయువూ; దధాతు = ప్రసాదిస్తుంది; శ్రియం = (వారు) ఐశ్వర్యంతో; వసానా = తులతూగుతూ; అమృతత్వమాయన్ = మరణంలేని స్థితికి చేరుకొంటారు; సద్యః = సత్వరం; సవితా = కీర్తిని; విదధ్యూన్ = విజయాన్ని; భజంతి = పొందుతారు.

**తా॥** *శ్రీదేవి చేరే వారిని ఐశ్వర్యం వరిస్తుంది; సంపద, దీర్ఘ ఆయుస్సు చేకూరుతుంది. వారు ఐశ్వర్యంలో తులతూగుతూ మరణం లేని స్థితికి చేరుకొంటారు. సత్వరమే వారు కీర్తిని, విజయాన్ని పొందుతారు.*

**శ్రియ ఏవైనం తచ్ఛ్రియామాదధాతి । సంతతమృచా వషట్కృత్యం సంధత్తం సంధీయతే ప్రజయా పశుభిః య ఏవం వేద । 37**

ఏవం = ఇవి; శ్రియ ఏవ = శ్రీదేవియే; తత్ = ఇలా గ్రహించిన వాడు; శ్రియాం = లక్ష్మీదేవిని; ఆదధాతి = చేరుకొంటాడు; ఋచా = మంత్రాలతో; వషట్ = యాగం; సంతతం = ఎల్లప్పుడూ; కృత్యం = చేయాలి; సంధత్తం = అలా చేసేవాడికి; ప్రజయా = పుత్రసంపద; పశుభిః = పశుసంపద; సంధీయతే = లభిస్తుంది; య ఏవం వేద = ఇలా తెలుసుకోవాలి.

**తా॥** మంచివి అన్నీ లక్ష్మీదేవియే - ఇలా తెలుసుకొన్నవాడు లక్ష్మీదేవిని చేరుకొంటాడు. మంత్రయుక్తంగా ఎల్లప్పుడూ యాగం చేయాలి. అలా చేసేవాడికి పుత్రసంపద, పశుసంపద లభిస్తుందని గ్రహించాలి.

**ఓం మహాదేవ్యై చ విద్మహే విష్ణుపత్నీ చ ధీమహి ।**
**తన్నో లక్ష్మీః ప్రచోదయాత్ ॥**

**ఓం శాంతిః శాంతిః శాంతిః ॥**

మహాదేవియైన లక్ష్మీదేవిని తెలుసుకొందాము. విష్ణుపత్నియైన ఆమెను అందునిమిత్తం ధ్యానిద్దాం. ఆ లక్ష్మీదేవి మనలకు ప్రేరణ నిచ్చుగాక!



**ఓమ్ భూమిర్భూమ్నా ద్యౌ ర్వరిణాఽ న్తరిక్షం మహిత్వా**

**ఉపస్థేతే దేవ్యదితేఽ గ్నిమన్నాద మన్నాద్యాయాఽదధే 1**

భూమ్నా = ఆధిక్యముతో; భూమిః = భూమి (భూమివై ఉన్నావు); వరిణా = శ్రేష్ఠతతో; ద్యౌః = ఆకాశము (వై ఉన్నావు); మహిత్వా = మహత్త్యముచే;అన్తరిక్షం = అంతరిక్షము (వై ఉన్నావు); దేవి అదితే = నాశనములేని ప్రకాశస్వరూపమైన భూమీ!; తే = నీ; ఉపస్థే = ఒడిలో (ఉత్సంగే అని సాయణవ్యాఖ్య) ; అన్నాదమ్ అగ్నిమ్ = అన్నమును భుజించు అగ్నిని; అన్నాద్యాయ = అన్నము సిద్ధించుటకై; ఆదధే = ఉంచుచున్నాను;

**తా॥** *గార్హపత్య అగ్నీ నీవు ఆధిక్యములో భూమి, శ్రేష్ఠతలో ఆకాశము, మహత్త్యముచే అంతరిక్షము అయిఉన్నావు. నాశనములేని ప్రకాశస్వరూపమైన భూమీ! నీ ఒడిలో నేను అన్నమును భుజించు అగ్నిని అన్నముసిద్ధించుటకై ఉంచుచున్నాను.*

**అయ గౌః ప్రశ్ని రక్రమీదసన్మాతరం పునః**

**పితరఞ్చ ప్రయన్త్సువః 2**

అయం = ఈ (అగ్ని); గౌః = గమనశీలుడు; ప్రశ్ని = శ్వేతవర్ణము గలవాడు; అక్రమీత్ = ఆక్రమించినాడు; పునః = మరల; మాతరమ్ = తల్లిని; అదనత్ = చేరినాడు; సువః పితరమ్ = స్వర్గరూపితండ్రిని; చ = కూడ; ప్రయన్ = చేరుచున్నాడు;

**తా॥** *ఈ గార్హపత్య అగ్ని ఆదిత్యరూపములో గమనశీలుడు, శ్వేతవర్ణముతో జగత్తునాక్రమించెను. మరల తల్లియైన పృథివిని చేరుకున్నాడు. తండ్రియైన స్వర్గమును కూడ చేరుచున్నాడు.*

త్రిగ్ంం శద్ధామవి రాజతి వాక్పతఙ్గాయ శిశ్రియే,
ప్రత్యస్య వహద్యుభిః. 3

త్రింశత్ = ముప్పది సంఖ్యగల; ధామ = తేజస్సు; విరాజతి = విశేషముగా ప్రకాశించుచున్నది; వాక్ = వాక్కు పతఙ్గాయ = సూర్యుని; శిశ్రియే = ఆశ్రయించినది; ద్యుభి = కాంతులతో; అన్య = తరిమివేయుము; ప్రతివహ = పొందింపజేయుము;

**తా॥** *ఆదిత్యరూపుడైన గార్హపత్యాగ్నికి చెందిన ముప్పది సంఖ్యగల కాలరూపతేజస్సు పది హేను పది హేను ముహూర్తములుగా ప్రకాశించుచున్నది. వైదికస్తుతిరూపమైన వాక్కుకూడ సూర్యుని ఆశ్రయించినది. ఓ అగ్ని నీవు మా పాపమును, దోషములను తరిమివేయుము. కాంతులతో మా హవిస్సును దేవతలకు పొందింపజేయుము.*

అస్య ప్రాణాదపానత్యన్తశ్చరతి రోచనా,
వ్యఖ్యన్మహిషస్సువః. 4

అన్య = ఇతని; రోచనా = ప్రకాశము; అపానతీ = అస్తమించుచూ; అన్తశ్చరతి = ఆకాశ, పృథివీ మధ్యన చరించును; మహిషః = ఆదిత్యుడు; సువః = ఆకాశము (స్వర్గము)ను; వ్యఖ్యత్ = ప్రకాశింపజేసెను;

**తా॥** *ఈ ఆదిత్యుని కాంతి అస్తమించుచూ పృథివీ మరియు అంతరిక్షముల మధ్య చరించును. ఈ ఆదిత్యుడు స్వర్గమును ప్రకాశింపజేసెను.*

**యత్వా క్రుద్ధః పరోవపమన్యునా యదవర్త్యా**

**సుకల్పమగ్నే తత్తవ పునస్త్వోద్దీపయామసి**

**యత్తే మన్యుపరోప్తస్య పృథివీ మనుదధ్వసే,**

**ఆదిత్యా విశ్వే తద్దేవా వసవశ్చ సమాభరన్ 5**

హే అగ్నే = హే దక్షిణాగ్నీ!; క్రుద్ధః = కోపించిన (నేను); మన్యునా = కోపముతో; త్వా = నిన్ను; పరోవప = పరా+ఉవప = దూరము చేసినాను; అవర్త్యా = దారిద్ర్యముతో; (ఓ అగ్నీ); తత్ = అది; తవ = నీ; సుకల్పమ్ = చక్కగా చేయబడినది; పునః = మరల; త్వా = నిన్ను; ఉద్దీపయామసి = జ్వలింపజేసెదము.

**తా॥** *హే దక్షిణాగ్నీ! కోపించిననేను కోపముతో నిన్ను దారిద్ర్యముచేత దూరము చేసుకొన్నాను. ఇప్పుడు అంతా సరిచేయబడినది. ఇక నిన్ను మరల ప్రజ్వలింపజేసెదము.*

**మేదినీ దేవీ వసుంధరా స్యాద్వసుధా దేవీ వాసవీ (వాసుకీ)**

**బ్రహ్మావర్చసః పితౄణామ్ శ్రోత్రం చక్షుర్మనః 6**

మన్యుపరోప్తస్య = కోపముచే దూరము చేయబడిన; తే = నీ యొక్క; యత్ = ఏ (తేజస్సు); పృధివీమ్ అను = పృధివిని; దధ్వసే = ధ్వస్తమైనదో; తత్ = దానిని; ఆదిత్యా = ఆదిత్యులు; విశ్వేదేవాః విశ్వేదేవతలు చవసవః = మరియువసువులు; సమాభరన్ = గ్రహింతురుగాక!;

**తా॥** *హే ఆహావనీయాగ్నీ! కోపముచేత దూరము*

చేయబడిన నీయొక్క ఏ తేజస్సు పృధివిని చేరి ధ్వస్తమైనదో దానిని ఆదిత్యులు, విశ్వేదేవతలు, వసువులు గ్రహింతురుగాక!

**దేవీ హిరణ్యగర్భిణీ దేవీ ప్రసోదరీ**

**సదనే సత్యాయనే సీద. 7**

మేదినీ దేవీ = భూదేవి; వసుంధరా = సంపదలను కలది; వసుధా = సంపదలను నిలువునది అగు; వాసవీ దేవీ = ఇంద్రసంబందమైన దేవత (ఈదేవత) పితౄణామ్ = పితృదేవతల; బ్రహ్మవర్చసః = బ్రహ్మవర్చస్సునకు శ్రోత్రమ్ = చెవి ; చక్షుః = కన్ను; మనః = మనస్సు; స్యాత్ = అగుగాక!

**తా॥** *ఈ భూదేవత సంపదలను గలది,సంపదలను నిలుపునది, ఇంద్రసంబధిని దేవత .ఈ దేవత పితృదేవతల బ్రహ్మవర్చస్సునకు చెవి,కన్ను,మనస్సు అగుగాక!*

**సముద్రవతీ సావిత్రీ ఆ(హ) నో దేవీ మహ్యాంగీ(కీ)**

**మహో ధరణీ మహోఽ త్యతిష్ఠత్ 8**

హిరణ్యగర్భిణీ దేవీ = హిరణ్యాగర్భుని దేవి, (తనయందు హితమును,రమణీయతను కలిగిన దేవీ తత్త్వము), సోదరీదేవీ = సమానమైన ఉత్పత్తిగల తత్త్వము; సత్యాయనే = సత్యము యొక్క గతి యైన; సదనే = నిలయములో; ప్రసీద = పూర్తిగా నెలకొనుము.

**తా॥** *హిరణ్యగర్భుని దేవి, సమానమైన ఉత్పత్తిగల తత్త్వము అయినది, నీవు సత్యమునకు నెలవైన ఇంటిలో పూర్తిగా నెలకొనుము.*

శృఙ్గే శృఙ్గే యజ్ఞే యజ్ఞే విభీషణీ,

ఇన్ద్రపత్నీ వ్యాపినీ సరసిజ ఇహా 9

శృఙ్గే శృఙ్గే = ప్రతిశిఖరములో; యజ్ఞే యజ్ఞే = ప్రతియజ్ఞములో; విభీషణీ = భయమును కలిగించునదియైన; ఇన్ద్రపత్నీ = ఇంద్రుని పత్ని; ఇహ = ఇక్కడ; సరసిజే = కమలములో; వ్యాపినీ = వ్యాపించుచున్నది.

**తా॥** *ప్రతిశిఖరములో, ప్రతియజ్ఞములో భయమును కలిగించునదియైన ఇంద్రుని పత్ని ఇక్కడ కమలములో వ్యాపించుచున్నది.*

వాయుమతీ జలశయనీ స్వయం ధా రాజా

సత్యం తో పరి మేదినీ స్తోపరిధత్తంగాయ 10

విష్ణుపత్నీం మహీం దేవీం మాధవీం మాధవప్రియామ్

లక్ష్మీం ప్రియసఖీం దేవీం నమామ్యచ్యుతవల్లభామ్ 11

విష్ణుపత్నీమ్ = విష్ణుపత్నియైనది; మహీమ్ = పూజనీయమైనది; దేవీమ్ = ప్రకాశించునది; మాధవీమ్ = విష్ణువునకు ప్రియమైనది; ప్రియసఖీమ్ = (విష్ణువుయొక్క) ప్రియసఖిని; అచ్యుతవల్లభామ్ = అచ్యుతునికి ప్రియమైన; లక్ష్మీం దేవీమ్ = లక్ష్మీదేవిని; నమామి = నమస్కరించుచున్నాను.

**తా॥** *విష్ణుపత్నియైనది, పూజనీయమైనది, ప్రకాశించునది, విష్ణువునకు ప్రియమైనది, (విష్ణువుయొక్క) ప్రియసఖిని, అచ్యుతునికి ప్రియమైన లక్ష్మీదేవిని నమస్కరించుచున్నాను.*

**ధనుర్ధరాయై విద్మహే సర్వ సిద్ధ్యై చ ధీమహి**
**తన్నో ధరా ప్రచోదయాత్.** **12**

ధనుర్ధరాయై = ధనుస్సును ధరించినది(దానికై); విద్మహే = తెలిపెదము; సర్వసిద్ధ్యై = సర్వసిద్ధియగుదానిని (దానికై); ధీమహి = ధ్యానించెదము(ఉంచెదము); తత్ ధరా = ఆ పృధివీతత్త్వము; నః = మనలను; ప్రచోదయాత్ = ప్రేరేపించుగాక!

**తా॥** *ధనుస్సును ధరించిన తత్త్వమును తెలిపెదము. అన్నిటి సిద్ధియగు తత్త్వమును ధ్యానించెదము. ఆ పృధివీతత్త్వము మనలను ప్రేరేపించుగాక!*

**శృణ్వన్తి శ్రోణామమృతస్య గోపాం,**
**పుణ్యామస్యా ఉపశృణోమి వాచమ్,**
**మహీం దేవీం విష్ణుపత్నీ మజూర్యాం**
**ప్రతీచీమేనాగ్ం హవిషా యజామః.** **13**

అమృతస్య = శాశ్వతమైన కర్మఫలమును; గోపామ్ = కాపాడునది; శ్రోణామ్ = శ్రవణనక్షత్ర రూపమైన దానిని; శృణ్వన్తి = వినెదరు(వినుచున్నారు); అస్యాః = ఈ శ్రోణయొక్క; పుణ్యామ్ = పవిత్రమైన; వాచమ్ = వాక్కును; ఉపశృణోమి = వినుచున్నాను (నేను); మహీం = గొప్పది; దేవీమ్ = ప్రకాశించునదియైన; విష్ణుపత్నీం = విష్ణుపత్నిని; అజూర్యాం = సంతాపము లేనిదానిని; ప్రతీచీమ్ = (మాకు) ఎదురుగా ఉన్నదానిని; హవిషా = హవిస్సుతో; యజామః = యజించెదము.

**తా॥** *శాశ్వతమైన కర్మఫలమును కాపాడు శ్రవణనక్షత్రరూప*

శ్రోణను జనులందరూ వినుచున్నారు. ఈ శ్రోణయొక్క పవిత్రవాక్కును నేను వినుచున్నాను. ఇది గొప్పది, ప్రకాశించునది, విష్ణుపత్ని సంతాపములేనిది, ఎదురుగా ఉన్నది. అట్టి ఈ శ్రోణను మేము హవిస్సుతో యజించెదము.

**త్రేధా విష్ణు రురుగాయో విచక్రమే**

**మహీన్దివం పృథివీ మన్తరిక్షమ్**

**తచ్ఛ్రోణైతి శ్రవ ఇచ్ఛమానా**

**పుణ్యం శ్లోకం యజమానాయ కృణ్వతీ. 14**

ఉరుగాయః = గొప్పకీర్తిగలవాడైన; విష్ణుః = విష్ణువు; పృధివీమ్ = పృధివిని; మహీమ్ దివమ్ = గొప్ప స్వర్గమును; అన్తరిక్షమ్ = అన్తరిక్షమును; త్రేధా = మూడు విధములుగా; విచక్రమే = వ్యాపించెను; తత్ = ఆత్రివిక్రమ రూపము; శ్రోణా = నక్షత్రరూపములో; ఏతి = వెళ్ళుచున్నది; శ్రవః = కీర్తిని; ఇచ్ఛమానా = కోరుచున్నదై; యజమానాయ = యజమానికై; పుణ్యం శ్లోకమ్ = ఉత్తమకీర్తిని; కృణ్వతీ = చేయుచున్నదై.

**తా॥** గొప్పకీర్తిగల విష్ణువు పృధివిని, గొప్పస్వర్గమును, అన్తరిక్షమును మూడు విధములుగా వ్యాపించేను. ఆత్రివిక్రమరూపము కీర్తిని కోరుచూ యజమానకై ఉత్తమకీర్తిని సంప్రాప్తింపజేయుచూ నక్షత్రరూపములో ఉండినది.

**స్యోనా పృథివి భవానృక్షరా నివేశనీ**

**యచ్ఛానః శర్మ సప్రథః 15**

స్యోనా = సుఖమునిచ్చునదియైన; పృధివి = ఓ పృధివీ!; అనృక్షరా = కంటకములు (ముళ్ళు) లేని; నివేశనీ = నివాసముగ; భవ = కమ్ము (ఉండుము); సప్రధః = విస్తృతమైన(శుభమును); నః మాకు; యచ్ఛ = ఇమ్ము.

**తా॥** సుఖమునిచ్చు ఓ పృధివీదేవతా! నీవు కంటకములు లేని చక్కని నివాసముగా ఉండుము. మాకు విస్తృతమైన శుభమును చేకూర్చుము.

**అదితిర్దేవా గంధర్వా మనుష్యాః పితరో సురాస్తేషాగ్ం**
**సర్వ భూతానాం మాతా మేదినీ మహతీ మహీ,**
**సావిత్రీ గాయత్రీ జగత్యుర్వీ పృధ్వీ బహులా విశ్వా**
**భూతా కతమా కాయా సా సత్యేత్యమృతేతి వసిష్ఠః 16**

అదితిః = అదితి; దేవాః = దేవతలు; గన్ధర్వాః = గంధర్వులు; మనుష్యాః = మనుష్యులు; పితరః = పితృదేవతలు; సురాః = దేవతలు (సురులు); తేషాం సర్వభూతానాం = ఈ అన్ని తత్త్వములు యొక్క; మాతా = తల్లి; మహతీ = గొప్పనైన; మేదినీ మహీ = వత్సల యైన పృధ్వీ; సావిత్రీ = సవితృ దేవతకు చెందినది; గాయత్రీ = గాయత్రి; జగతీ = గమనశీలమైనది; ఉర్వీ = విశాలమైనది; పృధ్వీ = విస్తృతమైనది; మహులా = అనేక మైనది; విశ్వా = సమస్తమైనది; భూతా = సత్తిను పొందినది; కతమా = ఎన్నవది; కా = ఎవరు; యా = ఎకరో; సా = అట్టి వృధివీతత్త్వము; సత్యాఇతి = సత్యమైనదని; అమృతా ఇతి = శాశ్వతమైనదని; వశిష్ఠః = వశిష్ఠుడు (భావించెను, చెప్పెను).

తా॥ అదితి, దేవతలు, గంధర్వులు, మనుష్యులు, పితృదేవతలు, సురులు ఈ అన్ని తత్త్వములకు తల్లి యైనది వాత్సల్యముగల పృధివీదేవత. సవిత్రి గాయత్రి జగతి, పృధివీ, బహుళా, విశ్వా అని తెలియు ఈ పృధివీ అస్తిత్వముగలది. ఇది ఎన్నవది ఎలాంటిది అనగా ఇది సత్యము శాశ్వతము అయినదని వశిష్ఠుదు చెప్పెను.

**ఇక్షుశాలియవసస్యఫలాఢ్యే పారిజాత తరుశోభితమూలే,**

**స్వర్ణ రత్న మణి మంటప మధ్యే చిన్తయేత్ సకలలోకధరిత్రీమ్. 17**

ఇక్షుశాలియవసస్య ఫలాఢ్యే = చెఱకు, శాలి, యవలు, సత్యము, ఫలములతో సంపన్నమైనది; పారిజాతతరుశోభితమూలే = పారిజాత వృక్షముయొక్క సుశోభితమైన మూలములో; స్వర్ణ రత్నమణి మంటపమధ్యే = స్వర్ణ, రత్న, మణులచే అలంకృతమైన మంటపములో (బంగారము రత్నములు పొదిగిన మణిమంటపములో); సకలలోకధరిత్రీమ్ = అన్ని లోకములను ధరించు (దేవతను); చిన్తయేత్ = ధ్యానించవలెను.

తా॥ చెఱకు, శాలి, యవ ధాన్యములు, ఫలములతో సంపన్నమైన పారిజాతవృక్షము యొక్క సుశోభితమైన మొదలులో బంగారము, రత్నములుగల మణిమంట పములో సకలలోకములను ధరించు (నిలుపు) దేవతను ధ్యానించవలెను.

శ్యామాం విచిత్రాం నవరత్న భూషితాం,
చతుర్భుజాం తుంగపయోధరాన్వితామ్,
ఇన్దీవరాక్షీం నవశాలి మంజరీం,
శుకం దధానాం శరణం భజామహే. 18

ప్రతిపదార్థము:- శ్యామమ్ = నలువువర్ణముగలది (అందమైనది); విచిత్రామ్ = అనేక విధములుగా ఉండునది; నవరత్నభూషితామ్ = నవరత్నములచే అలంకరించబడినది; చతుర్భుజామ్ = నాలుగు భుజములు గలది; తుంగ పయోధరాన్వితామ్ = ఎత్తైన స్తనములు గలది; ఇన్దీ వరాక్షీమ్ = కలువలవంటి కనులుగలది; నవశాలిమఞ్జరీమ్ = కొత్తధాన్యము యొక్క గుత్తులుగలది; శుకమ్ = చిలుకను; దధానామ్ = ధరించునది యైన దేవిని; శరణమ్ = శరణము; భజామహే = సేవించెదము.

తా॥ అందమైనది, అనేకవిధములుగా ఉండునది, నవరత్నములచే అలంకరించబడినది, నాలుగుభుజములు గలది, ఎత్తైన స్తనములు గలది, కలువలవంటి కన్నులు గలది, కొత్త ధాన్యములు గుత్తులుగలది చిలుకను ధరించునది యైన దేవిని శరణముగా సేవించెదము.

సక్తుమివ తితఉనా పునన్తో యత్ర ధీరా మనసా
వాచమక్రత అత్రా సఖాయస్సఖ్యాని జానతే భద్రైషాం
లక్ష్మీర్నిహితాధివాచి. 19

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

యత్ర = ఎక్కడైతే; ధీరాః = బుద్ధిమంతులు; తితఉనా = జల్లెడతో; సక్తుమ్ ఇవ = సత్తుపిండిని వలె; మనసా = మనస్సుతో; వాచమ్ = వాక్కును; పునన్తః = జల్లెడపడుతూ; అక్రత = చేసెదరో(మాటలాడెదరో); అత్ర = ఇక్కడ;సఖాయః = మిత్రులు; సఖ్యాని = మిత్రత్వమును, మైత్రిని; జానతే = తెలియుదురు; ఏషామ్ = వీరి; అధివాచి = వాక్కుయందు; భద్రా = మంగళకరమైన; లక్ష్మీః = శోభ (కాన్తి); నిహితా = ఉండినది.

**తా॥** *ఎక్కడ బుద్ధిమంతులు జల్లెడతో సత్తుపిండిని వలె తమ మనస్సుతో జల్లెడపడుతూ (యోగ్యమైన రీతిలో) మాటలాడెదరో, అక్కడ మిత్రులు మైత్రిని తెలియుదురు. వీరి వాక్కుయందు కల్యాణకారియైన శోభ ఉండును.*

*ఓం శాంతిః శాంతిః శాంతిః.*



# శ్రీనీలా సూక్తమ్

నీళాం దేవీగ్ం శరణమహం ప్రపద్యే॥ 1

నేను నీళాదేవిని శరణుజొచ్చుచున్నాను.

స్తోమత్రయస్త్రింశే భువనస్య పత్ని

వివస్వద్వాతే అభినో గృణాహి॥ 2

స్తోమత్రయత్రింశే = త్రయస్త్రింశమనెడు స్తోమముగల ఊర్ధ్వదేవతా!; భువనస్య = లోకమయొక్క; పత్ని = పాలించునది; వివస్వద్వాతే = వివస్వాన్ అనెడు వాయువుగల దేవతా!; నః = మమ్ములను; అభిగృణాహి = ఉద్దేశించి ఉపదేశించుము; సవితః = సవితృదేవతా!; ఇయంఆశా = ఈ దిక్కు; నః = మాకు; ఘృతవతీ = ఘృతమును సంప్రాప్తింపజేయునది; ఆధిపత్యైః = అధికపాలన శక్తులతో; పయస్వతీ = క్షీరమును సంప్రాప్తింపజేయునది; రన్తిః = ప్రీతికారణము; అస్తు = అగుగాక!.

**తా॥** *త్రయస్త్రింశమనెడి స్తోమముగల లోకములు పాలించునది అయిన, వివస్వాన్ అనెడి వాయువుగల సవితృదేవతా! ఈ దిక్కు మాకు ఘృతమును పాలన శక్తులతో క్షీరమును సంప్రాప్తింపజేయునది అగుచూ ప్రీతిని కలిగించుగాక!.*

ఘృతవతీ సవితరాధిపత్యైః పయస్వతీరన్తి రాశానో అస్తు।

ధ్రువా దిశాం విష్ణు పత్న్యఘోరా స్యేశానా సహసోయామ నోతా।

బృహస్పతి ర్మాతరిశ్వోతవాయు స్సన్ధువానా వాతా అభినో

గృణన్తు॥ 3

దిశామ్ = దిక్కులలో; ధ్రువా = ధ్రువమైనది(దిక్కు); అఘోరా = శాన్తమైనది; విష్ణుపత్నీ = విష్ణువు పతిగాగలది; అస్య సహసః = ఈ (బలముయొక్క); ఈశానా = పాలనజేయునది; మనోతా = మనస్సులో పూజింపబడినది; బృహస్పతిః = బృహస్పతి; ఉత = మరియు; మాతరిశ్వా; వాయుః = మాతరిశ్వమనెడి వాయువు; సన్దువానా = చక్కగా వీచెడి; వాతాః = గాలులు; నః = మమ్ములను; అభి = గురించి; గృణన్తు = హితమును కూర్చుగాక!.

**తా॥** *దిక్కులలో ధ్రువమైన ఈ దిక్కు శాన్తమైనది విష్ణువే పాలకుడుగా గలది, ఈ బలమును పాలించునది, మనస్సులో పూజింపబడినది. బృహస్పతి, మాతరిశ్వుడు, చక్కగా వీచెడి ఇతర వాయువులు మాకు హితమును చేకూర్చుగాక!.*

విష్టమ్భో దివో ధరుణః పృథివ్యా అస్యేశానా జగతో విష్ణుపత్నీ। విశ్వవ్యచా ఇషయన్తీ సుభూతిః శివా నో అస్త్వదితిరుపస్థే॥ 4

దివః = స్వర్గముయొక్క; విష్టమ్భః = ఆధారము; పృథివ్యా = పృథివియొక్క; ధరుణః = ధారణ చేయునది; అస్య = ఈ; జగతః = జగత్తుయొక్క; ఈశానా = పాలించునది; విష్ణుపత్నీ = విష్ణువును పాలకుడిగాగలది; విశ్వవ్యచా = విశ్వమును వ్యాపించునది; ఇషయన్తీ = ఇషమనగా అన్నము, దానిని అందరికీ కలిగించునది; సుభూతిః = ఐశ్వర్యముగలది, అయిన; అదితిః = అదితి దేవత; నః = మా; ఉపస్థే = సమీపమున; శివా = మంగళకరము; అస్తు = అగుగాక!.

**తా॥** *ఈ అదితి దేవత స్వర్గముయొక్క ఆధారము పృధివిని ధరించునది, ఈ జగత్తును పాలించునది, విష్ణువే పాలకునిగాగలది,*

విశ్వమును వ్యాపించునది, అందరికీ అన్నమును చేకూర్చునది, ఐశ్వర్యముగలది. ఇట్టి అదితి దేవత మా సమీపమున మంగళమును కలిగించునదిగా ఉండుగాక!.

**విష్ణుపత్న్యై చ విద్మహే శ్రీభూసఖ్యైచ ధీమహి।**
**తన్నో నీళా ప్రచోదయాత్॥ 5**

విష్ణుపత్న్యై = విష్ణువుచేత పరిపాలించబడు దేవతను (దేవతకొరకు); విద్మహే = తెలుసుకొనెదమమ; శ్రీభూసఖ్యైచ = లక్ష్మీదేవి, భూదేవి వీరి సఖియైన (నీళాదేవతను) లేదా నీళాదేవతకొరకు; ధీమహి = ధ్యానించెదము (ఉంచెదము); తత్ నీళా = ఆ నీళాతత్త్వము; నః = మమ్ములను (మనలను); ప్రచోదయాత్ = ప్రేరేపించుగాక!.

**తా॥** *విష్ణువు చేత పరిపాలించబడు దేవతను తెలియెదము. లక్ష్మీదేవి, భూదేవి వీరి సఖియైన నీళాదేవిని ధ్యానించెదము. ఆ తత్త్వము మనలను ప్రేరేపించుగాక!*

**అర్యమణం బృహస్పతి మిన్ద్రం దానాయ చోదయ।**
**వాచం విష్ణుం సరస్వతీం సవితారఞ్చ వాజినమ్। 6**

అగ్నే = అగ్నిదేవా!; అర్యమణమ్ = అర్యమదేవతను; బృహస్పతిమ్ = బృహస్పతిని; ఇన్ద్రమ్ = ఇంద్రుడిని; వాచమ్ వాక్కును; విష్ణుమ్ = విష్ణువుని; సరస్వతీమ్ = సర్వతిని; సవితారమ్ = సవితృదేవతను; వాజినమ్ = అన్నాధిపతిని; దానాయ = దానముకొఱకై; చోదయ = ప్రేరేపించుము.

**తా॥** *ఓ అగ్నిదేవా! అర్యమ, బృహస్పతి, ఇంద్రుడు, వాక్కు*

విష్ణువు, సరస్వతి, సవిత, అన్నాధిపతి యైన దేవతను దానము దానము కొఱకు ప్రేరేపించుము.

**సోమం రాజానం వరుణ మగ్నిమన్వారభామహే।**
**ఆదిత్యా విష్ణుం సూర్యం బ్రహ్మాణఞ్చ బృహస్పతిమ్॥ 7**

రాజానమ్ సోమమ్ = ప్రకాశించుసోమదేవతను; వరుణమ్ = వరుణుని; ఆదిత్యాన్ = అదిత్యులను; విష్ణుమ్ = విష్ణువును; సూర్యమ్ = సూర్యుడిని; బ్రహ్మాణమ్ = బ్రహ్మను; చ = మరియు; బృహస్పతిమ్ = బృహస్పతిని; అగ్నిమ్ = అగ్నిని; అన్వారభామహే = ఆశ్రయించెదము (అనుసరించి కర్మమొదలిడెదము).

**తా॥** *ప్రకాశించు సోమదేవతను, వరుణుని, అదిత్యులను, విష్ణువును, సూర్యుడిని, బ్రహ్మను, బృహస్పతిని మరియు అగ్ని దేవతను అనుసరించి (ఆశ్రయించి) కర్మను మొదలిడెదము.*

**దేవస్య త్వా సవితుః ప్రసవేఽశ్వినోర్బాహుభ్యాం పూష్ణో హస్తాభ్యాం॥ సరస్వత్యై వాచో యన్తుర్యంత్రేణాగ్నేస్త్వా సామ్రాజ్యేనాభిషిఞ్చామి॥ ఇన్ద్రస్య బృహస్పతే స్త్వా సామ్రాజ్యేనాభిషిఞ్చామి॥ 8**

సవితుః = సర్వప్రేరకుడైన; దేవస్య = ప్రకాశించుతత్త్వమైన; ప్రసవే = ప్రేరణలో (ప్రేరితుడైన నేను); త్వా = నిన్ను; (అగ్నయే =

అగ్నిక్తై) అశ్వినో: = అశ్వినీ దేవతల; బాహుభ్యామ్ = చేతులద్వారా; పూష్ణః = పూషన్ అనుబడు దేవతయొక్క; హస్తాభ్యామ్ = చేతులద్వారా; (జుష్టమ్ = ప్రియమైనదానిని) (నిర్వపామి = ఉంచెదను). సరస్వత్యై = సరస్వతి యొక్క (షష్ఠ్యర్థే చతుర్థీ భట్టభాస్కర); వాచ: = వాక్కుయొక్క; యన్తు: = నియమించు(నదైన) దాని; అగ్నే: = అగ్నియొక్క; యన్త్రేణ = నియమనముతో(ఆజ్ఞతో); సామ్రాజ్యేన = సామ్రాజ్యముతో; త్వా = నిన్ను; అభిషించామ = అభిషేకించెదను. ఇన్ద్రస్య = ఇంద్రుని; బృహస్పతే = బృహస్పతి(ఆజ్ఞతో); త్వా = నిన్ను; అభిషించామి = అభిషేకించెదను.

**తా॥** *సర్వప్రేరకుడైన ప్రకాశించుతత్త్వముచే ప్రేరితుడైన నేను అగ్నికొఱకు అశ్వినీదేవతల, పూషదేవతయొక్క చేతులద్వారా ప్రియమైన హవిస్సును ఉంచెదను. సరస్వతి, నియామకతత్త్వము, అగ్ని వీని ఆజ్ఞతో నిన్ను నేను సామ్రాజ్యమునకై అభిషేకించెదను. ఇంద్రుని, బృహస్పతి యొక్క ఆజ్ఞతో నిన్ను సామ్రాజ్యమునకై అభిషేకించెదను.*

**నిషసాద ధృతవ్రతో వరుణః పస్త్యాస్వా సామ్రాజ్యాయ సుక్రతుః। దేవస్య త్వా సవితుః ప్రసవే। అశ్వినోర్బాహుభ్యాం పూష్ణో హస్తాభ్యామ్। అశ్వినోర్భైషజ్యేన తేజసే బ్రహ్మవర్చసాయాభిషిఞ్చామి॥ 9**

ధృతవ్రత: = ధరించినవ్రతముగలవాడు (వ్రతధారణ చేసినవాడు); వరుణ: = అనిష్టమును నివారించువాడు; సుక్రతు: = మంగళసంకల్పము గలవాగడు,(అయిన యజమాని); సామ్రాజ్యాయ = సామ్రాజ్యముకొరకై; పస్త్యాసు = (శత్రువుల) గృహములలో; ఆనిషసాద = వచ్చి కూర్చొనెను; (దేవస్యత్వా మొదలైనది ముందు మత్రములో

వలె(గ్రహించాలి); అశ్వినో: అశ్వినీదేవతల; భైషజ్యేన = వైద్యముతో; తేజసే = తేజస్సునకై; బ్రహ్మవర్చసాయ = బ్రహ్మవర్చస్సుకై; అభిషించామి = అభిషేకించెదను.

**తా॥** యజ్ఞదీక్షను దాల్చినవాడు, అనిష్టమును నివారించువాడు మంగళసంకల్పము గలవాడు అయిన యజమాని సామ్రాజ్యము కొఱకై శత్రువులలో గృహములలో చేరి కూర్చొనెను (శత్రువులను ఓడించెను). అశ్వినీ దేవతల వైద్యముతో నేను తేజస్సు మరియు బ్రహ్మవర్చస్సుకై నిన్ను అభిషేకించెదను.

**దేవస్య త్వా సవితుః ప్రసవే। అశ్వినోర్బాహుభ్యాం పూష్ణోహస్తాభ్యామ్। సరస్వత్యై భైషజ్యేన। వీర్యాయాన్నాద్యా యాభిషిఞ్చామి॥** 10

(దేవస్యత్వా ఇత్యాది మంత్రము ముందు వివరింపబడినది) సరస్వత్యై = సరస్వతియొక్క; భైషజ్యేన = వైద్యముతో; వీర్యాయ = బలము, వీర్యముకొరకు; అన్నాద్యాయ = అన్నము మొదలైన వానికై; అభిషించామి = అభిషేకించెదను.

**తా॥** సరస్వతియొక్క వైద్యముతో బలము, వీర్యము కొరకు అన్నము మొదలైనవానిని పొందుటకు నిన్ను అభిషేకించెదను.

**దేవస్య త్వా సవితుః ప్రసవే। అశ్వినోర్బాహుభ్యాం పూష్ణోహస్తాభ్యామ్। ఇంద్రస్యేంద్రియేణ శ్రియై యశసే బలాయాభిషించామి॥ అమృతాభిషేకోఽస్తు ॥** 11

**ఓం శాంతిః శాంతిః శాంతిః ॥**

ఇన్ద్రస్య = ఇంద్రుని; ఇన్ద్రియేణ = ఐశ్వర్యముతో; శ్రియై = సంపదకై; యశసే = కీర్తికై; బలాయ = మలముకై; అభిషించామి = అభిషేకించెదను; అమృతాభిషేక: = అమృత అభిషేకము; అస్తు = అగుగాక!.

**తా॥** *ఇంద్రుని ఐశ్వర్యముతో నేను సంపదకై, కీర్తికై బలముకై నిన్ను అభిషేకించెదను. (ఇది) అమృతాభిషేకమగుగాక!.*

ఓం శాంతిః శాంతిః శాంతిః.



**యస్తే మన్యో విధద్వజ్రసాయకసహఓజః పుష్యతి విశ్వమా నుషక్ సాహ్యామదాస మార్యం త్వయా యుజా సహస్కృతేన సహసా సహస్వతా ॥1॥**

హేమన్యో = క్రోధ అభిమాని దేవతా !; యః = ఏ యజమాని (యజ్ఞము చేయువాడు); తే = నీకు; అవిధత్ = పరిచర్య చేయునో; హేవజ్ర = వజ్రమువలె దృఢమైన మరియు; సాయక = బాణము వలె శత్రువులను హింసించు దేవా!; సః = అతడు; విశ్వమ్ = మొత్తము; సహః = బలమును; ఓజః = శారీరకబలమునూ; అనుషక్ = వెంట ఉండునదిగా (అనుషక్తముగా); పుష్యతి = పెంపొందించును (నీ అనుగ్రహముచే యజమాని యుద్ధములో బలమును పొందును). అందుకనే మేము; సహస్కృతేన = బలము చేత ఉత్పన్నమైన; సహసా = అణచివేయునది అయిన; సహస్వతా = బలవంతమైన; త్వయాయుజా = నీ సహాయము చేత (మేము); దాసమ్ = నాశనము చేయు; అర్యమ్ = మాంకంటె ఎక్కువైన శత్రువును కూడ; సాహ్యామ = అణచివేసెదము;

**తా॥** *(క్రోధ అభిమాని) మన్యుదేవతా! ఏ యజమాని నీ పరిచర్య చేయునో అతడు బాహ్యము, ఆభ్యన్తరమునూ అయిన మొత్తము బలమునూ వెంట ఉండునదిగా పొంది నీ అనుగ్రహముచే యుద్ధములో బలమును పెంపొందించు కొనును. వజ్రమువలె దృఢమైన, బాణమువలె శత్రువుల హింసించు మన్యుదేవతా! బలము చేత ఉత్పన్నమైనది, శత్రువులను అణచివేయునది, బలవంతమైనది అయిన నీ సహాయముతో మేము నాశనము చేయువాడు, మాకంటె ఎక్కువైన వాడు అయిన శత్రువును కూడ అణచివేసెదము.*

**మన్యురింద్రో మన్యురేవాస దేవో మన్యుర్హోతా వరుణో జాతవేదాః మన్యుం విశ ఈళతే మానుషీర్యాః పాహి నో మన్యో తపసా సజోషాః ॥2॥**

మన్యుః = ఈ మన్యుదేవత; ఇన్ద్రః = ఇంద్రుడు; మన్యుఃఏవ = మన్యుదేవతయే; దేవః = దేవత; ఆస = ఉండెను; మన్యుః = మన్యుదేవత; హోతా = (హోమమును నిర్వర్తించు) అగ్ని; జాతవేదాః = సర్వజ్ఞుడైన; వరుణ = వరుణుడు; యాః మానుషీ = మానవులైన; విశః = ప్రజలు; మన్యుం = మన్యుదేవతను; ఈళతే = స్తుతించెదరు; మన్యో = మన్యుదేవతా!; తపసా = తపస్సను పేరుగల నీ తండ్రితో కలిసి; సజోషాః = సమానప్రీతిగలిగి నీవు(మమ్ము); పాహి = రక్షింపుము.

**తా॥** *ఈ మన్యుదేవత ఇంద్రుడు, మన్యుదేవతయే దేవతగా ఉండెను. మన్యుదేవతయే హోమనిష్పాదకమైన అగ్ని, సర్వజ్ఞుడైన వరుణుడు. మానవులైన ప్రజలు ఈ మన్యుదేవతను స్తుతించెదరు ఓ మన్యుదేవతా! తపస్సను పేరుగల నీ తండ్రితో కలిసినీవు సమానప్రీతి గలిగి మమ్ములను రక్షింపుము.*

**అభీహి మన్యో తవసస్త వీయాన్ తపసాయుజా విజహి శత్రూన్ అమిత్రహా వృత్రహా దస్యుహా చ విశ్వావసూ న్యాభరా త్వన్నః ॥3॥**

మన్యో = మన్యుదేవతా!; తవసః = బలవంతుని కంటె; తవీయాన్ = బలవంతుడైన; త్వం= నీవు (మమ్ములను); అభీహి = చేరుము; తపసా యుజా = తపస్సను తండ్రి సహాయముతో; శత్రూన్

= శత్రువులను; విజహి = వధించుము; అమిత్రహా = శత్రువులను వధించువాడు; వృత్రహా = ఆక్రమించువారిని వధించువాడు; దస్యుహాచ = మరియు నశింపజేయువారిని వధింపజేయువాడయిన; త్వం = నీవు; విశ్వా = అన్ని; వసూని = ధనములను; నః = మాకొరకు; ఆభర = తెమ్ము.

**తా॥** మన్యుదేవతా! బలవంతునికంటె బలవంతుడవైన నీవు మా యజ్ఞములో మమ్ము చేరుము. తపస్సు అను తండ్రి యొక్క సహాయముతో నీవు మా శత్రువులను వధించుము నీవు శత్రువులను, ఆక్రామకులను, నాశకులను నశింపజేయువాడవు. అట్టి నీవు మాకొఱకు అన్ని ధనములను తెమ్ము.

**త్వం హి మన్యో అభిభూత్యోజా స్స్వయం భూర్భామో అభిమాతిషాహః విశ్వచర్షణి స్సహురిస్సహావా నస్మా స్వోజః పృతనాసుధేహి ॥4॥**

మన్యో = మన్యుదేవతా; హి = నిశ్చయముగా; త్వమ్ = నీవు; అభిభూత్యోజాః = శత్రువుల బలమును అణచివేయువాడవు; స్వయంభూః = స్వయముగా ఉత్పన్నమైనవాడవు; భామః = క్రోధము గల వాడవు; అభిమాతిషాహః = శత్రువులను అణచివేయువాడవు; విశ్వచర్షణిః = అందరినీ గ్రహించువాడవు; సహురిః = అణచివేయు స్వభావము గలవాడవు; సహావాన్ = అణిచివేయుసామర్థ్యము గలవాడవు.అట్టి నీవు; అస్మాసు పృతనాసు = మా సేనలయందు,(యుద్ధములలో); ఓజః = బలమును; ధేహి = పెంపొందించుము.

**తా॥** ఓ మన్యుదేవతా! నిశ్చయముగా నీవు శత్రువుల

బలమును అణచి వేయువాడవు, స్వయముగా ఉత్పన్న మైనవాడవు, క్రోధము గల వాడవు శత్రువులను అణచివేయువాడవు, అందరినే గాంచెడివాడవు. అణచివేయు స్వభావము, సామర్థ్యము గలవాడవు. అట్టి నీవు యుద్ధములలో మా (సేనల) బలమును పెంపొందింపజేయుము.

**అభాగ స్సన్న పపరేతో అస్మి తవ క్రత్వా తవిషస్య ప్రచేతః**
**తంత్వామన్యో అక్రతుర్జిహీళాహం స్వాతనూర్బలదేయా యమేహి ॥5॥**

(మన్యో = మన్యుదేవతా); ప్రచేతః = ప్రకృష్టమైన జ్ఞానముగల మన్యుదేవతా!; తవిషస్య = గొప్పనైన; తవ = నీ; క్రత్వా = కర్మచేత; అభాగఃసన్ = అభాగ్యుడనై; అపపరేతః అస్మి = యుద్ధములో ఓడి వైదొలగినాను; మన్యో = మన్యుదేవతా!; తం = అట్టి; త్వా = నిన్ను; అక్రతుః = కర్మరహితుడనైన; అహం = నేను; జిహీళ = కోపింపజేసినాను; స్వాతనూః = నా శరీరమైన (నీవు); బలదేయాయ = బలమునొసగుటకు; మేహి = నన్ను చేఱుము.

*తా॥* ప్రకృష్టమైన జ్ఞానము గల మన్యుదేవతా! అభాగ్యుడనై నేను యజ్ఞములో (నీ కర్మతో నిన్ను అర్చించక) యుద్ధములో ఓడి వైదొలగినాను. మన్యుదేవతా! కర్మరహితుడనై నేను నిన్ను కోపింపజేసినాను. నా శరీరమైన నీవు నాకు బలమును చేకూర్చుటకు నన్ను చేఱుము.

**అయం తే అస్మ్యుపమే హ్యర్వాజ్ప్రతీ చీనస్సహురే**
**విశ్వధాయః మన్యో వజ్రి న్నభి మామావవృత్స్వహనా వదస్యూన్**
**ఋతబో ధ్యాపేః ॥ 6**

సహురే = శత్రువులనణచువాడా!; విశ్వధాయః = విశ్వమును నిలుపువాడా! మన్యుదేవతా!; అయం(జనః) = ఈ నేను; తే = నీకు చెందినవానిగా (నీకొరకే కర్మలనాచరించువానినై); అస్మి = ఉన్నాను, (కావున); ప్రతీచీనః = తిరుగువెళ్ళనీవు; మా = నన్ను; అర్వాజ్ = ఎదురుగా; ఉపేహి = వచ్చిచేరుము; మన్యో = మన్యుదేవతా!; వజ్రిన్ = వజ్రమును ధరించు దేవా!; మామ్ = నన్ను; అభ్యావవృత్స్వ = వచ్చి చేరుము, (మనమిద్దరము); దస్యూన్ = శత్రువులను; హనావ = వధించెదము; ఉత = ఇంకనూ, (మరియూ); ఆపేః = బన్దువుగా (నన్ను); బోధి = నీవెఱుగుము.

**తా॥** *శత్రువులనణచివేయు, విశ్వమును నిలువు మన్యుదేవతా! నేను నీకొఱకే నేను కర్మలనాచరించువాడిని. కావున మరలివెళ్ళ నీవు వచ్చిచేరుము. వజ్రమును ధరించు మన్యుదేవతా! నన్ను వచ్చి చేరుము వనమద్దరము శత్రువులను వధించెదము. మరియూ నీవు నన్ను బంధువుగా తెలియుము.*

**అభిప్రేహి దక్షిణతో భవామేధా వృత్రాణి జంఘనావభూరి**
**జుహోమి తే ధరుణ మ్మధ్వో అగ్రముభా ఉపాంశు ప్రథమా**
**పిబావ ॥ 7**

మన్యో = మన్యుదేవతా!; అభిప్రేహి = (నన్ను)

చేఋము.(యుద్ధములో); మే = నాయొక్క; దక్షిణతః = కుడివైపున; భవ = ఉండుము; అధ(అథ) = ఇక; వృత్రాణి = శత్రువులను; భూరి = అధికముగా; జంఘనావ = వధించెదము; తే = నీకు; అగ్రమ్ = శ్రేష్ఠమైన; ధరుణమ్ = ఉదకమును; మధ్వః = సోమరసమును; జుహోమి = హవనములో సమర్పించెదను; ఉభా = మనమిద్దరము; ప్రథమా = మొదటివారమై; ఉపాంశు = రహస్యముగా; పిబావ = త్రాగెదము.

**తా॥** మన్యుదేవతా ! నన్ను చేఋము. యుద్ధములో నా కుడివైపున ఉండుము. ఇక మనమిద్దరము శత్రువులను అధికముగా వధించెదము. నీకు శ్రేష్ఠమైన ఉదకమును సోమరసమును హవనములో సమర్పించెదను మనమిద్దరము మొట్టమొదటగా దీనిని రహస్యముగా త్రాగెదము.

**త్వయా మన్యో సరథమారుజంతో హర్ష మాణాసో ధృషితా మరుత్వః తిగ్మేషవ ఆయుధాః సంశిశానా అభిప్రయంతు నరో అగ్నిరూపాః ॥8**

హేమన్యో = హే మన్యుదేవతా !; హే మరుత్వః = వాయువు తోడుగా గల దేవా !; త్వయా = నీతోకలిసి; సరథమ్ = ఒకే రథమును; ఆ రుజన్తః = అధిరోహించి శత్రువుల దుర్గములను నశింపజేయువారు; హర్షమాణానః = హర్షించినవారు; అధృషితాః = శత్రువులచేత అణచివేయబడనివారు; తిగ్మేషవః = పదునైన బాణములు గలవారు; ఆయుధా = ఆయుధములను; సంశిశానాః = పదును బెట్టుచున్నవారు; అగ్నిరూపాః = అగ్నివలె ప్రచండ కర్మల నాచరించువారు, అయిన; నరః = జనులు; అభియన్తు = (శత్రువులను) ఎదుర్కొనెదరుగాక!.

తా॥ వాయువు తోడుగాగల మన్యుదేవతా! నీతో కలిసి ఒకే రథమునధిరోహించి శత్రువుల దుర్గములను నశింపజేయువారు, ఆనందము గలవారు, శత్రువులచేత అణచివేయబడలేని వారు, పదునైన బాణములు గలవారు, తమ ఆయుధములను పదును బెట్టుచున్నవారు, అగ్నివలె ప్రచండకర్మల నాచరించువారునూ అయిన జనులు శత్రువులనెదుర్కొనెదరుగాక !

సాయణాచార్యుల భాష్యానుసారం, పై మంత్రంలోని 'అధృషితా' అనే పదము 'ధృషితా' అనగా 'ధృష్టా:' అనే అర్థంలో గ్రహించబడింది. కాని నిరుక్తం 10-19 మంత్రపాఠం ప్రకారం 'అధృషితా:' అనే పదమిక్కడ గ్రహింపబడింది. దుర్గాచార్యుల వ్యాఖ్యానంలో కూడ 'అధృషితాః = అధర్షితాః - అరిభి; అనభిభూతా:' అనే చెప్పబడింది. పాఠకులు గమనించగలరు.

**అగ్నిరివ మన్యో త్విషిత స్సహస్వ సేనానీర్నస్సహురే హూతఏధి హత్వాయ శత్రూన్విభజస్వ వేద ఓజో మిమానో విమృధోనుదస్వ ॥9**

మన్యో = మన్యుదేవతా!; అగ్నిరివ = అగ్నివలె; త్విషిత: = జ్వలించినవాడవై; సహస్వ = శత్రువులనణచివేయుము; న: = మాయొక్క; సేనానీ = సేనలను నడిపించువాడవై; హూత: = ఆహ్వానింపబడినవాడవు నీవు (యుద్ధములో); ఏధి = ఉండుము; శత్రూన్ = శత్రువులను; హత్వాయ = వధించి; వేద: = ధనమును (శత్రు సంపదను); విభజస్వ = (మాకు) వంచి ఇవ్వుము; ఓజ: = బలమును; మిమాన: =

పొందింపజేయుచూ. నీవు; మృధః = శత్రువులను; వినుదస్వ = వధింపుము.

**తా॥** ఓ మన్యుదేవతా! నీవు అగ్ని వలె జ్వలించి శత్రువుల నణచివేయుము. మా సేనలను నడిపించు సేనానిగా ఆహ్వానించినపుడు నీవు యుద్ధములో (సేనానిగా) ఉండుము. శత్రువులను వధించి వారి ధనమును మాకు పంచిఇమ్ము. మా బలమును పెంపొందింపజేయుచూ మా శత్రువులను వధింపుము.

**సహస్వ మన్యో అభిమాతి మస్మే రుజన్ మృణన్ ప్రమృణన్ ప్రేహి శత్రూన్ ఉగ్రంతే పాజోనన్వారు రుధ్రే వశన్నయసఏక జత్వమ్ ॥10**

మన్యో = మన్యుదేవతా!; అస్మే = మా యొక్క; అభిమాతిమ్ = శత్రువును; సహస్వ = అణచివేయుము; రుజన్ = (శత్రువులకు) పీడకలిగించుచూ; మృణన్, ప్రమృణన్ = అధికముగా దుఃఖము కలిగించుచూ; శత్రూన్ = శత్రువులను; ప్రేహి = ఎదుర్కొనుము; తే = నీ; పాజః = బలము; ఉగ్రమ్ = ప్రచండమైనది; ను = కదా! (దానిని); న ఆరురుధ్రే = అడ్డగించువారు లేరు; ఏకజ = ఒక్కడిగా జన్మించిన దేవా!; వశీ = అసహాయుడవు; త్వమ్ = నీవు; వశమ్ = వశమునుకు; నయ = తెమ్ము.

**తా॥** మన్యుదేవతా ! మా శత్రువులనణచివేయుము. వారికి పీడను, అధికముగా దుఃఖమును కలిగించుచూ వారినెదుర్కొనుము. నీ బలము ప్రచండమైనది కదా! దానినడ్డగించువారెవరూ లేరు. ఒక్కడిగా జన్మించినదేవా! ఒక్కడివే నీవు మా శత్రువులను మా వశమునకు తెమ్ము.

**ఏకో బహూనా మసిమన్యవీళితో విశం విశం యూధయే సంశిశాధి అకృత్త రుక్త్వయా యుజా వయం ద్యుమంతం ఘోషం విజయాయ కృణ్మహే ॥11**

మన్యో = మన్యుదేవతా!; ఈళిత: = స్తుతింసబడిన నీవు; ఏక: = ఒక్కడివి; బహూనామ్ = అనేకులకు (దీటు); అసి = అయి ఉన్నావు; విశంవిశమ్ = ఆయా జనులను; యూధయే = యుద్ధము కొఱకు; సంశిశాధి = చక్కగా పదునుబెట్టుము (పురిగొల్పుము); అకృత్తరుక్ = నష్టమవని కాంతిగలవాడా!; త్వయాయుజా = నీ సహాయముతో; వయమ్ = మేము; విజయాయ = విజయము కొఱకు; ద్యుమన్తమ్ = కాంతిగలది (గొప్ప); ఘోషమ్ = శబ్దమును; కృణ్మహే = చేసెదము.

**తా॥** *మన్యుదేవతా! స్తుతింపబడిన నీవు ఒక్కడివే అనేక శత్రువులకు దీటుగా ఉన్నావు. నీవు నా శత్రువు లైన ఆయా జనులను యుద్ధమునకై పురిగొల్పుము. నష్టమవని కాంతి గల మన్యుదేవతా! నీ సహాయముతో మేము విజయము కొఱకు గొప్పశబ్దమును (సింహనాదమును) చేసెదము.*

**విజేషకృదింద్ర ఇవానవబ్రవో..3..స్మాకం మన్యో అధిపా భవేహ ప్రియంతే నామ సహురే గృణీమసి విద్మాతముత్సం యత ఆ బభూథ ॥12**

మన్యో = మన్యుదేవతా; ఇన్ద్ర ఇవ = ఇన్ద్రుని వలె; విజేషకృత్ = విజయమును కలిగించువాడు; అనవబ్రవః = సత్యవాక్కు (నిరుక్తము 6-6-1); ఇహ = ఈ (యుద్ధము లేదా క్రతువులో); అస్మాకం = మా; అధిపా = రక్షకుడవు; భవ = కమ్ము; సహురే = శత్రువులనణచివేయుదేవా!; తే = నీ; ప్రియమ్ = ప్రియమైన; గృణీమసి = కీర్తించెదము; యతః = దేనిచే (నీవు); ఆబభూథ = వర్ధిల్లెదవో; తమ్ = ఆ; ఉత్సమ్ = బలమును; విద్మ = మేమెఱిగెదము.

**తా॥** *ఓ మన్యుదేవతా! నీవు ఇంద్రునివలె విజయమును చేకూర్చువాడవు, సత్యవాక్కువు. ఈ క్రతువులో మా రక్షకుడవు కమ్ము శత్రువులనణచివేయు దేవా! నీ ప్రియమైన నామమును మేము కీర్తించెదము. దేనితో నీవు వర్ధిల్లెదవో ఆ బలమును మేమెఱిగెదము.*

**ఆ భూత్యా సహజా వజ్రసాయకసహో బిభర్ష్యభిభూత ఉత్తరమ్ క్రత్వానో మన్యో సహమేద్ధ్యేధి మహాధనస్య పురుహూత సంసృజి ॥13**

వజ్ర = వజ్రమువలె దృఢమైన; సాయక = బాణమువలె తీక్ష్ణమైన (మన్యుదేవతా); అభిభూతే = శత్రువులనణచి వేయుదేవా!; సహజా = సహజమైన; ఆ భూత్యా = అణచివేయు సామర్థ్యముతో నీవు; ఉత్తరమ్ = ఉత్కృష్ట తరమైన; సహః = బలమును; బిభర్షి = దాల్చియున్నావు; నః = మా; క్రత్వా = కర్మతో; సహ = కలిసి నీవు; మేద్యేధి = ప్రవర్ధిల్లుము; మహాధనస్య = మహాధనమను యుద్ధముయొక్క; సంసృజి = మార్గములో; పురుహూత = నీవు అధికముగా ఆహ్వానింపబడినవాడివి.

**తా॥** వజ్రము వలె దృఢము, బాణము వలె తీక్ష్ణము అయి శత్రువుల నణచివేయు మన్యుదేవతా నీ సహజమైన అణచివేయు

సామర్థ్యముతో నీ వు ఉత్కృష్ట తరమైన బలము కలిగియున్నావు. మహాధనమనబడు యుద్ధము యొక్క మార్గములో అధికముగా ఆహ్వానింపబడు నీవు మాకర్మతో బాటు ప్రవర్ధిల్లుము.

**సంసృష్టం ధన ముభయం సమాకృత మస్మభ్యంధత్తాం వరుణశ్చమన్యుః భియం దధానా హృదయేషు శత్రవః పరాజితాసో అపనిలయంతాం ॥14**

వరుణ = వరుణుడు; చ = మరియు; మన్యు = మన్యుదేవత; సంసృష్టమ్ = చక్కగాకలిసినది; ఉభయమ్ = ఉభయవిధమైన; ధనమ్ = ధనమును; అస్మభ్యమ్ = మాకు; దత్తామ్ = ఇచ్చెదరుగాక!; శత్రవః = మా శత్రువులు; హృదయేషు = హృదయములలో; భియమ్ = భయమును; దధానాః = ధరించినవారై; పరాజితాసః = ఓడినవారై; అపనిలయన్తామ్ = పారిపోదురుగాక!.

**తా॥** *వరుణుడు మరియు మన్యుదేవత ఈ ఇద్దరు విభజింపబడని, ఉభయ విధమైన ధనమును మాకిచ్చెదరుగాక! మా శత్రువులు హృదయములో భయము కలిగి ఓడినవారై పారిపోయెదరుగాక!.*

**ధన్వనాగా ధన్వనా జిం జయేమ ధన్వనా తీవ్రా స్సమదో జయేమ ధనుశ్శత్రో రపకామం కృణోతు ధన్వనా స్సర్వాః ప్రదిశో జయేమ ॥15**

**ఓం శాంతిః శాంతిః శాంతిః**

ధన్వనా = ధనుస్సుతో (శత్రువుల యొక్క); గాః = గోవులను; జయేమ = జయించెదము; ధన్వనా = ధనుస్సుతో; ఆజిమ్ = యుద్ధమును; జయేమ = జయించెదము; ధన్వనా = ధనుస్సుతో; తీవ్రా = క్రూరమైన; సమదః = శత్రుసేనలను; జయేమ = జయించెదము; ధను = ధనుస్సు; శత్రోః = శత్తువుయొక్క; కామమ్ = కోరికను; అపకృణోతు = వ్యర్థము చేయునుగాక!; ధన్వనా = ధనుస్సుతో; సర్వాః ప్రదిశః = అన్ని దిక్కులను; జయేమ = జయించెదము.

**తా॥** *ఈ ధనుస్సుతో శత్రువుల గోవులను జయించెదము, యుద్ధమును జయించెదము. శత్రువుల క్రూరమైన సేనలను జయించెదము. ఈ ధనుస్సు శత్రువు యొక్క కోరికలను వ్యర్థము చేయు గాక! ధనుస్సుతో అన్ని దిక్కులనూ జయించెదము.*

*ఓం శాంతిః శాంతిః శాంతిః.*

పై మంత్రములో 'కృణోతు' అన్న పాఠము ఋగ్వేదం 6-75-2 ప్రకారం. నిరుక్తం 9-2-11 ప్రకారం 'కృణోతి' అన్న పాఠమున్నది.





ఓం నారాయణాయ విద్మహే వాసుదేవాయ ధీమహి ।
తన్నో విష్ణుః ప్రచోదయాత్ ॥

నారాయణుని తెలుసుకొందాం. అందు నిమిత్తం ఆ వాసుదేవుని ధ్యానిద్దాం.
ఆ విష్ణువు మనలను యీ ధ్యాన ప్రయత్నంలో ప్రేరేపించుగాక!







రామకృష్ణ మఠం
దోమలగూడ, హైదరాబాదు - 500 029
email : rktelugubook@gmail.com
www.rkmath.org

10041 Pancha Suktalu ₹ 20.00